# నర్తనశాల

## (కీచకవధ నాటకము)

★

*విశ్వనాథ సత్యనారాయణ

# అంకితము

## పితృదేవుడు కొల్లిపర సూరయ్యకు

వర్ణవైషమ్యంబు వాడిపోయిన దయ్య
అర్ణవవైశాల్యమైన నీ యాత్మలో

శారదజ్యోత్స్నా వర్షాతుషారమ్ములు
నీ రమ్యమూర్తిలో నిగ్గుతేలిన వయ్య

చిగురువేదములు వాసించు నీ లోపల
నగరయ్యేలే యశోనవ్యవల్లరులకు

రమణీయపూర్వసారస్వతప్రేమలో
కమనీయుడైన భాగస్వామి వైనావు

విశ్వనాథ సత్యనారాయణ
కొండాలి ఆంజనేయులు

# పాత్రలు

| | |
|---|---|
| కీచకుడు | ద్రౌపది |
| శారద్వతుడు | సుదేష్ణ |
| కంకభట్టు | ఉత్తర |
| తంత్రీపాలుడు | వల్లకి |
| వలలుఁడు | దాసి |

# ప్రథమాంకము

## నాంది

ఆర్తత్రాణపరాయణత్వమున హైమాంబుప్రవాహోధమై
ధూర్తప్రాణహరత్వనిష్ఠ మెయి నుద్భూతార్చిషంబై జగత్
కర్తృత్వాదుల కేక కారణము నై కామాగ్నికుండంబు నా
తార్తీయీకము శైవలోచనము సంధానించు నైశ్వర్యముల్

అనులయనృత్యదాత్మవృషభాధిప మగ్రజటాసముల్లస
త్ఫణభుజగాభిరామము రవన్మణిజోద్గతశబ్దశాస్త్రకా
రణము క్రమప్రకామమధురస్వర మూర్జితమైన శ్రీకరో
చన నవసాంధ్యతాండవము సాధుమృదూక్తుల మాకొసంగుతన్

(నాంద్యంతమున సూత్రధారుఁడు)

ఆలస్య మేమియును లేదు. పరిశ్రమద్వారాతముగ నే బద్ధప్రణయుఁ డగు నాయకుంబోలె సీ నాటకమునెడ ప్రథమ పరిచయమున నే బద్ధాదరుల మయిన మేము, దీనివిషయ మేమి యయినను జెప్పుటకూడ న్యాయముగాదు. అయినను వారా కావ్యము సాదరభావముతోఁ బరిశీలించుటకుఁ బ్రియామూర్తులైన పారిషదులఁ బ్రసన్నులం జేసికొనెదము.

మున్ను కలశాంబునిధిఁ దచ్చుకొన్న యప్పు
డా మహాదేవి జనియించె కామధేను
మూర్తి సాక్షాత్సరస్వతి పుణ్యరాశి
ఆమె కపరావతారము లంట వినుము (తెర)

# ప్రథమాంకము

ప్రవేశము — కీచకుడు, ద్రౌపది, త్రస్త

కీచకుడు :

మన్ముజార్జిత ధారుణీమండలంబు
వేలుచుండె విరాట ధాత్రీశ్వరుండు
శత్రునృపతులు మత్స్యదేశముల పైని
దృష్టి పఱుపరు నా కంటిమెఱుపుఁ జూచి

నాకు సుదేష్ణ తోఁబుట్టువు. నా పేరు సింహాబలుఁడు. ఈ యంతఃపురమున నీవు క్రొత్తదానివలె నున్నావు. పేరడుగవచ్చునా ?

ద్రౌ : (మౌనము)

కీచ : నేను మా యక్కగారి యంతఃపురమునకు వచ్చి సంవత్సరము కావచ్చినది. అప్పుడు నిన్నుఁ జూడలేదు. ఏలనో నిన్నుఁజూచిన నీతో మాటాడవలెననిపించినది. క్రొత్తఁగా నుండి సంశయించితిని.

ద్రౌ : (మౌనము)

కీచ : ఈ జాజిపూవులతావి యెక్కడిది ? నీ మేనిదియా? నీ వెన్నాళ్ళయినది యిక్కడకు వచ్చి? మా యక్క నీచేత నేమిపనులు చేయించును ?

ద్రౌ : (నిష్క్రమించును.)

సుదేష్ణ : (ప్రవేశించి) నాయనా! ఎప్పుడు వచ్చితివి!

కీచ : ఇప్పుడే వచ్చితిని. — ఇటుల వెళ్ళినది. ఆమె ఎవరు ?

సు : నీవు మా భావగారికిఁ గనఁబడితివా ?

కీచ: కనబడ లేదు. ఆయమ యెన్నిదినము లై నది యిచ్చటకు వచ్చి?

సు: ఎవ్వరో పరిచారిక! ఇంటివద్ద నందఱు బాగుగ నుండిరా మనవాండ్రు?

కీచ: బాగుగనే యున్నారు. ఆ కాంత యెవ్వరు?

సు: ఆమె యెవరో సత్కులీన. తమ్ములందఱు బాగుండిరా? అమ్మతిరుగుచున్నదా? విశ్రాంతిగా సుఖముగా డాదుకొనుచున్నాడా?

కీచ: అక్కా!

ఆ మనోహర దివ్యరూపాతిశయము
మానవాంగనలందు సామాన్య మగునె?
యెచట దొరకించుకొంటివో యీవు సేవ
కప్సరఃకాంతయోగ్యమౌ నాభరణము?

సు: నీ కేమైన పిచ్చియా? మీ బావగారు నీకుఁ గబురంపించ నెంచుచున్నారు! నీవే వచ్చితివి.

కీచ: ఆయమ యెవ్వరో చెప్పవు?

సు: ఉత్తర నిన్నుఁ జూడవలె ననుచున్నది. దానిని దీసికొని వచ్చెదను. నీవు నా గృహమువద్ద నుండుము. (నిష్క్ర

కీచ: ఎంత పలుకరించిన మాటాడ లేదేమి? ఆచూపులలోఁ బ్రాసమున్నది. కాని యది క్రొత్తదితన మేమో! ఆ వదనాంచలము లేవి యీ శరీరరేఖ లేమి? యెంతటి సౌందర్యనిధానములు!

ద్రౌ: (ప్రవేశించి) సుదేష్ణాదేవి యిచ్చట లేదే! పూలదండ నామె కియ్యవలెనన్న నామె యెచటి కరిగినదో?

## ప్రథమాంకము

ప్రవేశము—కీచకుడు, ద్రౌపది, స్త్రీ

కీచకుడు :

> మత్స్యజాంగల ధారుణీమండలంబు
> ఏలుచుండె విరాట ధాత్రీశ్వరుండు
> శత్రునృపతులు మత్స్యదేశముల పైని
> దృష్టి నిలుపరు నా కంటిమెఱుపుఁ జూచి

నాకు సుదేష్ణ తోఁబుట్టువు. నా పేరు సింహబలుఁడు. ఈ యంతఃపురమున నీవు క్రొత్తదానివలె నున్నావు. నీ పేరడుగవచ్చునా ?

ద్రౌ : (మౌనము)

కీచ : నేను మా యక్కగారి యంతఃపురమునకు వచ్చి సంవత్సరము కావచ్చినది. అప్పుడు నిన్నుఁ జూడలేదు. ఏలనో నిన్నుఁజూచిన నీతో మాటాడవలె ననిపించినది. క్రొత్తఁగా యని సంశయించితిని.

ద్రౌ : (మౌనము)

కీచ : ఈ జాజిపూవులతావి యెక్కడిది ? నీ మేన నుండియా? నీ వెన్నాళ్ళయినది యిక్కడకు వచ్చి? మాయక్క నీచేత నేమిపనులు చేయించును ?

ద్రౌ : (నిష్క్రమించును.)

సుదేష్ణ : (ప్రవేశించి) నాయనా! ఎప్పుడు వచ్చితివి?

కీచ : ఇప్పుడే వచ్చితిని.—ఇటుల వెళ్ళినది. ఆమె యెవ్వరు ?

సు : నీవు మీ బావగారికిఁ గనంబడితివా ?

కీచ: కనబడ లేదు. అయమ యెన్ని దినములైనది యిచ్చటకు వచ్చి?

సు: ఎవ్వరో పరిచారిక! ఇంటివద్ద నందఱు బాగుగ నుండిరా మనవారు?

కీచ: బాగుగనే యున్నారు. ఆ కాంత యెవ్వరు?

సు: ఆమె యెవరో సత్కులీన. తమ్ములందఱు బాగుండిరా? అమ్మ తిరుగుచున్నదా? విశ్రమించుచున్నదా?

కీచ: అక్కా!

> ఆ మనోహర దివ్యరూపాతిశయము
> మానవాంగనలందు సామాన్యమగునె?
> యెచట దొరకించుకొంటివో యీవు సేవ
> కప్సరకింతయోగ్యమా నాభరణము?

సు: నీకేమైన పిచ్చియా? మీ బావగారు నీకుఁ గబురంపించ నెంచుచున్నారు! నీవే వచ్చితివి.

కీచ: అయమ యెవ్వరో చెప్పవు?

సు: ఉత్తర నిన్నుఁ జూడవలె ననుచున్నది. దానిని దీసికొని వచ్చెదను. నీవు నా గృహమువద్ద నుండుము. (నిష్క్ర)

కీచ: ఎంత పలుకరించిన మాటాడ లేదేమి? అచూపులలోఁ బ్రాసమున్నది. కాని యది క్రొత్తదిగన మేమో! ఆ వదనాంచలము [illegible] యా శరీరరేఖ లేమి? యెంత సౌందర్యనిధానములు!

ద్రౌ: (ప్రవేశించి) సుదేష్ణాదేవి యిచ్చట లేదే! ఈ పూలదండ నామె కియ్యవలెనన్న నామె యెచటి కరిగినదో?

కీచ: (చూచి) ఆహా! మళ్ళీ నిటునే వచ్చు చున్నది. (సమీపించి) ఆ పూమాల నిన్ను నూర్చిన దేనా? అవును! నిన కూర్చి యుందువు! లేకున్న నంతయంద మెక్కడిది దానికి? అది యెవరికొఱకు గుచ్చితివి?

ద్రౌ: (స్వ) పౌరబాటున మాటల నితని గలసికొంటిని.

(పోఁబోవును)

కీచ: (అడ్డువచ్చి) చెలి! ఇదియేమి? నీకోమలశరీరము నుపవాసకృశీభూతము చేయుచున్నావు! ఈమేను మాత్రము తపోయోగ్యమైనది కాదు. కంది, పూడ మెత్తబారినది.

ద్రౌ: (తొలఁగి పోఁబోవును.)

పరిచారిక: (ప్రవేశించి) స్వామి. కీచకమహారాజ! దేవి యుత్తరాసహిత యై తమ్మొదురు చూచుచున్నది.

కీచ: (స్వ) ఈమెవిషయము మాయక్కగారివలనఁగాని బోధపడునటుల లేదు. (ప్ర) ఆమె యెక్కడ నున్నది?

పరి: వసంతపాలికోద్యానమున!

కీచ: (నిష్క్రమించును).

ద్రౌ: ఇతఁడు ముందచ్చటికిఁ బోవును గాబోలు. నే నేల వీని వెంటఁ బోవలయును? తరువాత నీసంగతి సుదేష్ణతో విన్నవించెదను.

కుడిక వ్రాదయుచున్నది. ఇది బాగుగాఁ బట్టిన ముసుగే కావలయును. ఇత డెవరై యుండు?

పరి: ఏ మమ్మా సైరంధ్రి! ఏమో యాలోచించు చున్నావు?

ద్రౌ: ఏమియు లేదు. సుదేష్ణాదేవి యెచ్చటకు వెళ్ళినది?

పరి : మహారాజుకీచకస్వామివచ్చెననియాయుష్మంతురా లుత్తరను దీసికొని వచ్చుటకు నర్తనమందిరమునకు వెళ్ళినది.

ద్రౌ : ఆమె వెళ్ళుట యేల? పరిచారికలు లేరా?

పరి : కీచకస్వామియెడ నామెకుఁగల సౌదర్యమువలన!

ద్రౌ : ఎవరీ కీచకుఁడు మున్నెన్నఁడు వినలేదు.

పరి : కొంచెము గౌరవముగా మాట్లాడుము. ఆయన నామము నిరుపపదముగా నుచ్చరింపరానిది.

ద్రౌ : క్షమింపుము. ఆయన యెవ్వరు?

పరి : సుదేష్ణాదేవియు, నాయనయుఁ బినతల్లి పెదతల్లి బిడ్డలు.

ద్రౌ : ఆయన యిప్పు డెచటనుండి వచ్చినారు?

పరి : ఆయన నివాసము విరాటనగరముననే కాని యీ రాజమందిర మీపట్టణమున కావైపునుండును. ఎందుకు నీ వాయనను గూర్చి ప్రశ్నించెదవు?

ద్రౌ : పురుషులకుఁ బ్రవేశింపరానియీయంతఃపురము నీతఁ డెట్లు ప్రవేశించినాఁడు? భూమింజయాదిరాజకుమారులే ప్రవేశింపరాదే?

పరి : ఆయనకుసుదేష్ణాదేవియెడఁగలచనవట్టిది. అదియుఁగాక యాయన భుజాబలమే మత్స్యధాత్రీతలమునకు రక్ష.

ద్రౌ : (మౌనము)

పరి : ఆతఁడు నూఱుగురుతమ్ముల కన్న. సకలపరివారముతోడ నతఁడు కొలువున నిలిచినచో విరాటుఁడు కాదు రాజు; ఆయనయే.

ద్రౌ : దుర్యోధనునకు నితనికి మంచిపోలిక యున్నది.

పరి: ఆయన మానవతీపంచ బోణులు.

ద్రౌ: నేను దేవిగారిని గలసికొనవలెను. (నిష్క్రమణ)

పరి: సైరంధ్రి మొదలు తానేమొ వన్నెగాఁడు గూర్చి యడిగెనది. నేను గొంచెము నూచించిన విమతిగా వలె నటించినది, కాషాయవస్త్రములు కల్మషము దాచ గలవు.

ఉత్తర: (ప్రవేశించి) ఓసీ! వల్లకీ! మామాను జాతీ కుసుమములు కోసికొని రమ్మా. పూలమాల గ్రుచ్చవలె.

పరి: అమ్మా! తమకై వారు దయచేసిరే! తమకుఁ గనఁబడలేదా?

ఉ: ఆయనను బుష్పమాలవినా నేను దర్శించను.

పరి: సైరంధ్రి యొద్ద నొకటి యున్నది.

ఉ: పోయి తీసికొనిరమ్మా!

పరి: (నిష్క్రమించును.)

ఉ: (స్వ) ప్రస్తావనలో బృహన్నలోపాధ్యాయులు సైరంధ్రిని దాము మున్నెఱుఁగుదుమనియు, హస్తినలోఁ దాము శ్రీ యుధిష్ఠిరచక్రవర్తి యాస్థానమున నాట్యాచార్యులుగా నున్నప్పుడీ సైరంధ్రి యచటనే యుండెడిదనియుఁ జెప్పి యామెను గూర్చి మిక్కిలి గౌరవముగఁ బ్రసంగ మొనర్చినారు. ఆయమ గ్రుచ్చిన పూమాల నూమాముకొసంగిన బాగుగనుండ దేమో! (ప్ర) వల్లకీ! వలదు. నీవు పోయి పూచిన యా మందారవద్ద నున్నజాతులు తీసికొని రమ్మా!

పరి: (జాతులు తెచ్చి యిచ్చును)

ఉ: ఆహా! ఈ జాతీకుసుమవాసన లెంత మనోహరముగ నున్నవి.

ప్రవేశము. సుదేష్ణ—కీచకుఁడు

ఉ: మామా! ఈపూవులు నీకై తెచ్చితిని.

కీచ: అమ్మా! సౌభాగ్యవతివి కమ్ము.

సు: తల్లి! మామయ్యకు నమస్కరింపుము?

ఉ: (అట్లు చేయును.)

కీచ: (లేవదీసి) అమ్మాయికి నాట్య మెంతవఱకు వచ్చినది? మొన్న నెపుడో చూచినా నీయమ గురువును. మనోహరముగ నున్న దామూర్తి. సాహిత్యతేజ మాతని మొగమున గంభీరముగ నున్నది.

అక్కా! అమ్మాయికిఁ బెండ్లి యెప్పుడు!

సు: కళ్యాణపు గడియలు రావలయును.

కీచ: ఉత్తర సిగ్గుపడుచున్నది. ఎప్పుడు నేర్చితివమ్మాయి? ఆ గురువు నేర్పినా డేమి?

ఉ: (స్వ) మామ మిక్కిలి రమ్యముగ మాటలాడుచున్నాఁడు. ఇతనిని గూర్చి కొన్నివదంతులు చెడ్డగా నున్న వేలనో!

కీచ: అమ్మా! నీవు బాగుగాఁ జదువుకొనుము. ఇది తీసికొమ్ము. (అని మెడలోని హార మిచ్చును.)

ఉ: (గ్రహించి) పాఠశాలలోఁ బుస్తకములు వదలి వచ్చితిని. సెలవు తీసికొందును.

సు: వల్లకీ! నీవు తల్లి వెంటఁ బొమ్ము!

(వల్ల-ఉత్తర-నిష్క్ర)

సు: నాయనా! నీవు నాట్యశాస్త్రమున మహాప్రజ్ఞ కలవాఁడవందురుగా! అమ్మాయి నేమియుఁ బరీక్ష చేయ లేదేమి?

కీచ:—సోదరీ!

> ప్రథమ దర్శనమై యింతవఱకు నెందు
> గడియ లేనియుఁ గాలేదు కలఁగిపోవు
> చున్నయది నాహృదంతరం బూఱడిలక
> అంత సౌందర్యవతి యా లతాంగి యెవరు?
> అప్సర స్త్రీల సమాజంబు లా వెలంది
> కాలిగోటికి కెనియౌ సరిగారనుత్కృ
> ప్రకృతిలో నున్న సౌభాగ్యభాగ్య మెల్ల
> సంతరించు కొన్నది యా లతాంగి యెవరు?
> ఏడుదీవుల రాజ్యంబు తెలుపడికి
> చిహ్నమైన కిరీటంబు శిరమునందుఁ
> దాల్చుటకు యోగ్యమైన దా తలిరుబోడి
> యంత తేజస్సు కల దా లతాంగి యెవరు?

సు: పరస్త్రీప్రశంస పాపహేతువు కాని యింకొక విషయము మాటలాడుము. ఆ భాగ్యశాలిని యెవరో పాపము, మన యంతఃపురమునఁ దల దాచుకొన వచ్చినది.

కీచ: అక్కా! క్షమింపుము! ఏమి చేయుదు నమ్మా!

> ఈ శిరోరంధ్రముల నింగుమొత్తుచున్న
> దశమమార్గణధను రజ్ఝు శాశుగముల
> వేగమునఁ జేసి నుడివడి వీచుచున్న
> గాలి చేసిన యట్టి యుగ్రత్వనంబు.

సు: ఒకప్పుడు చిత్తవికార మేర్పడినను, దానిని స్వాధీన పఱచుకొనవలయును. మఱల నా ప్రశంసఁ దేకుము.

కీచ: అక్కా!

సు: రాజాంతఃపురములయం దిట్టి యిక్కట్టు లున్నవని యే యావిడ తొలుత నావద్దఁ బ్రవేశించుచున్నప్పుడు, తన్ను గౌరవముగా చూడఁగలిగిననే నావద్దఁ బనిచేసెద నన్నది. ఈ

దాని నిన్న నెలలోపలఁ జూచుచుంటిని. ఆమె తులసిమొగ్గ వంటిది. ఆమె సైరంధ్రీవ్రత మనుష్ఠించుచున్నది.

కీచ: అక్కా! నా ప్రాణములమీఁది యాస వదలుకొమ్మనెదవా?

సు: అబ్బా! ఇదేమి? ఆమె మొగముఁ జూచినఁ బూజింపవలెనను భావము గలుగును గాని యిట్టి దురూహలు నీ కేటులఁ బుట్టినవి?

కీచ: నా కామె పాదాభివందనముఁ గూడఁ జేయవలెనని యున్నది.

సు: ఆమెను విరాటనృపతి యంతఃపురము తలదాఁచు కొనవచ్చినది. ఈయంతఃపురము నీ యీ దుష్టభావమున కామెను లోఁబఱచదు.

కీచ: కాక నా ప్రాణములు త్రుంచుకొనిపోవునా మఱి.

సు: నాయనా! ఈ యధర్మమునకు నన్నులోఁగఁదీయకుము. మహాపౌరుషశాలివైన నీబుద్ధి పరకాంతలపై నేల ప్రసరింపవలె?

కీచ: అక్కా! ఈ మనస్సింతవఱకు నన్ను బాధించుచున్నది! ఆ మనోహారిణి పేరైన వినఁజాలనేని నా యీ జన్మ మెందులకు?

సు: అది నాకుఁ దెలియదు. ఆమె సైరంధ్రీవ్రత మనుష్ఠించుచున్నది. కాన నామె నిందఱును సైరంధ్రియనియే వ్యవహరింతురు. నీ వింత పిచ్చిలో నున్నావుగాన నీ కొక మాట చెప్పెదను. ఆమెకుఁ బతులుగలరఁట. వారు గంధర్వులు. అయిదుగురు. మహాబలశాలులు. వాయుసమానవిక్రములు.

అతిశయితబాలకేతకీ మైత్రప్రభాత
చంద్రికానతనవనీతసౌకుమార్య
మై శరత్కాలసితజలవాభ మగుచు
నా హృదంతరమూలఘనంబు గాల్చె.

ద్రౌ: (ప్రవేశించి) సుదేష్ణాదేవి యింకను నొంటరిగా నున్నదా? అంతఃపురమునకు ప్రొద్దు గ్రుంకుచున్నది. ప్రొద్దు గ్రుంకకముందే సుదేష్ణాదేవితోఁ జెప్పవలయును. (పరిక్రమించి) అహో నేఁడు నా దురదృష్టమేమొ! ఇతని నొంటరిగాఁ గలసికొంటిని. ఇందు సుదేష్ణాదేవి యున్నదని చెప్పినదే చెల్లకి! దాసిప్రవర్తన బాగుగనుండ లేదు. తొలఁగి పోయెదనుగాక!

కీచ: ప్రేయసీ! నన్నేల త్రిప్పలు పెట్టెదవు?

ఒకమాట పలికి సంతస
సకియా! ముత్తెముల వాన జారిపడునటే?
ప్రకుపితనేత్రద్యుతియు
క్రకచంబుల నన్నుఁ గోయఁగా నేమిటికే?

పలుకంగరాదె యో ప్రాభాతవేళామృతస్యందినీజాతసమవచన!
నను జూడరాదె యో నవ్యశారదకాలసితసరాంభోజకళిల్పితశృంగత!
చిఱునవ్వరాదె యో శ్రీకరచ్ఛవిదీప్తకరుణాతోయద్దంతపంక్తి!
యింత నిల్వగరాదె శోభాగమనవ్యమధురమరాళగమనయూః

యెంత నిర్దయురాలవే యిగురుబోడి?
తావకీన సర్వాంగసౌందర్యమంతుఁ
బ్రసవమార్దవ మండియుఁ గైకొంచి
కఠినతామార్గ మేల నీ కంబుకంఠి!

దేవీ! కన్నెత్తి చూడుము! నీదృగంతభాగీరథీవాహినిలోఁ బవిత్రుడనై పోయెదను స్నానములాడి.

ద్రౌ: అన్నా! ఏమిది! ఈవికృతాకార మేమి? నేనేమి? నన్నుఁ జూచిన నీకు మదనవికారమా? నీకుఁ బరిచూచినను

బాహుసత్త్వగలిగిన నావంటి పిచ్చివాండ్రకేనా యాపదలు! దేవి సుదేష్ణ కోపగించును. నాకుఁ బని యున్నది. త్రోవ యిమ్ము పోయెదను !

కీచ : ఓహో ! శరత్కాలచంద్రరేఖ ! ఎంత మాటా డితివి ! నీ కృపాపాంగమునకై వేచియున్నవానిని నన్నేల నిటులు మాటలాడి విముఖుని జేసికొనెదవు ?

మాధుర్యమా! నన్నేల నీలో నొకభాగముగాఁ జేర నీయక విషమ్మువలె నెంచెదవు? సామాన్యముగాఁ బురుషు లిట్లే ప్రథమమునఁ బ్రేమావేశముఁజూపి యనంతరము పరిత్యజింతు రనుకొందువో! మనోహారిణీ! ఇదె యొట్టు పెట్టుకొనెదను.

రమ్యజలదమాలానీలసౌమ్యగగన
భాగరమణీయమైన యీ ప్రాంగణమునఁ
దీరుగాఁ బూఁచినట్టి మందారమిదిగొ
యీ శిరోభాగమున కరంబిడినొ యుంచి!

ద్రౌ : నమస్కరించెదను. నన్నుఁ బోనిమ్ము !

కీచ : చెలీ ! నాపై నీ కింతయైన కేల ననుగ్రహము రాలేదు? నా పూర్వజన్మకృతపాపఫల మింతగా బాధించు చున్నది. ప్రియా! దయఁజూపుము, దయఁజూపుము.

(చేయి గ్రహింపఁబోవును)

ద్రౌ : ఓయీ! ఎంతటి తెలివిమాలినవాఁడవు. దాసీ సంగమము లాయుఃక్షైణ్యములు. అందులో నికృష్టదాసి నైన నన్నా నీవు వరించునది ?

కీచ : మదనవతీ! ఆయుఃక్షైణ్యమా! కానిమ్ము! నీ సంయోగములేని యాయువుమాత్ర మేమిటికి? స్వర్గభోగము లనుభవించనా? ఆనందధామము లేకనా?

నీవు గాఢపరిష్వంగ నియతిఁ గలుగు
నిముస మేనియు బ్రతికితి నేని జాలు
నీ కెడము గల్గి కల్పముల్ నిండువఱకు
బ్రతికితిం యున్న! భస్మహావ్యంబ, యేల?
నీ యురోజాగ్రమున నుండు నిముసలోన
మృత్యుదేవత నైన రానిమ్ము నాకు
భయము లేదె మృగాక్షి! యీ భవమువలనఁ
గలుగు లాభ మా భాగ్యమే కలిగియుంట.
నీ పరీరంభమునను నిందీవరాక్షి
తెలుగు నే యున్న యాయువు, తఱిగ నేని
మిగిలెఁ దె యనుభూతము మెలఁత! కాక
యిప్పుడే గతియుంటు కాదటవే లతాంగి!

(సమీపించును)

ద్రౌ: (తొలఁగి) పరస్త్రీలపై నేల ప్రసరించుచున్నవి నీనృపులు? నీవేమొ బాహుబలతృణీకృతాఖిలమత్స్య దేశ శాత్రవుఁడవటె! ఇది నీకు యోగ్యము గాదు. పరస్త్రీసంగమంబునఁ గలుగుదోషమును నీవంటి దోషజ్ఞునకు నా చెప్పఁబని లేదు.

కీచ: ప్రేయసీ! కనంబడుచున్న దివ్యజ్యోతిస్సును జల్లార్పకుము. (చేయి గ్రహింపఁబోవును)

ద్రౌ: (తొలఁగి)

నావెంటన్ నిరతంబుఁ గాచికొని యున్నారేవు రస్మత్పతుల్
ద్యావాభ్యంతరగాము లెందయిన గంధర్వుల్ స్వకీయోగ్రబా
హావిస్ఫూర్జితశాత్రవసమూహానంతకీర్తిస్ఫురత్
శ్రీవిద్యోతితమూర్తులా కెలన నీ చేటింతయున్ దప్పదే!

కీచ: ఇదియా యింతసెఱకు నీ యనుమానము? నీ కేమియు భయము లేదు. నాబలము నా చేతనే యేల పొగడించెదవు? రాజసభలు సుష్ఠుగాఁ బండించిన మత్స్యదేశము లే దానికి సాక్షులు.

ప్రసవపంచకబాణసంపాతకీలి
నా శరీరావయవముల నాసి చూడు
ముడుచుకొని యెంత బాణము పడునొ యేమొ
యొంటుఁ గుంచుకొన్నవో యోసి చంచలాక్షి

ఆలస్యముచేసిన న్నేలదహించెదు? నీయాలస్యముకొలఁది నాప్రాణములు నిల్చుటకు ధైర్యముకూడ నాకుఁ జెడుచున్నది.

ద్రౌ: ఓయీ! మహాగ్నిజ్వాలను ఫలమని భ్రమించుచుంటివి.

కీచ: చెలీ! దయచూపుము! నీశరీరస్పర్శచేతనే పులకిత బ్రహ్మానందము పొందు నా కేల దూరదూరముగ పోయెదవు

(సమీపించును)

ద్రౌ: సుదేష్ణా! అయ్యో! నాజన్మకిట్టి యీదృశ పరాభవము. సుదేష్ణా!

కీచ: అయ్యో! భూతలస్వర్గమాత్రమైన స్వర్గ మేల నిరాకరించెదవు?

ద్రౌ: అయ్యో! నీ యీ ప్రవర్తన మీమహారాణిగారి యంతఃపురగౌరవమునకు భంగకరమైనది.

కీచ. (నిర్వ్యాజమొగా) మంచి సంగతి జ్ఞాపకము జేసితివి. కాని నాహృదంతరము దహించుచున్నది మఱచుచుంటివి.

ఏ ప్రశీతలవాటికానశ్రీప్రకాశ
మైన నిముసంబునందు నా యంగ మంటి
ప్రసవగంధికమకరందమసృణశిశిర
మైన నీ మేను స్వర్గసౌఖ్యం బొసంగునా!

(నిష్క్రమించును)

సు: (ప్రవేశించి) అమ్మా! సైరంధ్రి. ఇదేమి? శోకాధిదేవతవోలె నున్నది.

ద్రౌ : దేవీ! వింటివా యీదీనురాలి యవమానము!

సు : ఏమమ్మా?

ద్రౌ : నీతోఁ బుట్టినవాఁడు. అతని పేరు నాకుఁ దెలియదు. విరాటరాజు లేనపుడు, నన్ను జెఱఁబట్టనిచ్చెను. దేవి! యేమని చెప్పుకొందు! నాజన్మ మేమోకాని సురక్షితము లైన ప్రదేశములలోనే నాకుఁ బరాభవములు తటస్థించుచున్నవి. చెప్పితిని గదా తొలుత నీతో, నొకానొక కారణమునఁ జేసి నాపతుల యెదుటనే రాజసభలో నున్న పరాభవింపఁబడితినని. మఱల నిఁక! భూమిపాలురు, రాజకుమారులుగూడ రారాని యీ యంతఃపురమున నా స్థితి యిట్లైనది?

సు : అయ్యో! ఎంతపని జరిగినది. తల్లీ! ఇది యెవ్వరితో ననకుము. నేను వానిని జీవాట్లు పెట్టి పంపించెదను. ఇఁక నీవున్నంతవఱకు నతఁ డిచటికి రాకుండఁ జేసెదను. నాకెంతటి యప్రతిష్ఠ నచ్చుపని చేసినాఁడు. నాచేతనైనంతవఱకు వాని బారి నీవు పడకుండఁ జేసెదను. మఱపిల్లకుము.

ద్రౌ : కానిమ్ము! నీయండఁ జేరితిని గదా! దానివలన గలుగు ప్రతిష్ఠాప్రతిష్ఠలు నీవియే!

సు : అమ్మా! మన్నింపుము. నేనతని కన్నొమలఁగిపోవుటకే యిచటినుండి వెళ్ళితిని. నేనున్నచో నట్టిపని తటస్థించెడిది కాదు! నీవిచ్చటి కెట్లు వచ్చితివి?

ద్రౌ : అతఁడు మొదట నన్నుఁ గలసికొని యేదియో ప్రసంగింపవచ్చినాఁడు. నేను మారాడక యతని దప్పించుకొని నీతోఁ జెప్పవలెనని యిచ్చటికి వచ్చితిని. మీరు లేరు. అతఁడిందుండెను.

సు: చెలియలా! ఇక్కట్టులలో నున్నవారికే క్రొత్త యిక్కట్టులు. నాతో వాడు నీ ప్రసంగమే తెచ్చినాడు. నే నతని యెదుట నున్నంతవఱకు కల్లె మాటలాడు ననియు నతడు వదలిపోయిన బాగుగనుండు ననియు, నే నిచటనుండి వెడలి పోతిని. నీతో నీవిషయము చెప్పి యతఁ డుంకొన్నగాని సేపు నీవు వాని కనులకుఁ గన్పింపకుండ నుండుమని చెప్పుటకు వచ్చితిని. నీవు నాకుఁ గనరాలేదు. దురదృష్టవశమువలన నీ విచ్చటకే వచ్చితివి కావలె. తల్లీ! నీకడుపు పుచ్చుకొని బ్రతిమాలెదను. సుదేష్ణ యంతఃపురమున నిట్లు జరిగె నని చెప్పకు మమ్మా యెచ్చటను! నేను నీ కింక యెద్దడి లేకుండఁ జేసెదను. అట్లు చేయ నని నా చేతిలో చేయి వేయుము.

ద్రౌ: అన్నవస్త్రము లిచ్చి పోషించితి విన్నాళ్ళు. నేఁ డేదియో నాదురదృష్టమున నిట్లు ఘటిల్లినది. నీ వేమిచేసెదవు తల్లీ! నిన్ను నే నెఱుగనా! నీపై నేదేని యని నే నేమని బ్రదుకగలను.

సు: నీ వింక పద—నల్లకీ! సింహబలుఁ డెందున్నాడో?

(తెరపడును)

# ద్వితీయాంకము

ప్రవేశము — కీచకుడు. ఉద్యానములో

కీచ :

ఈ విరహవహ్ని నన్ను దహించు చిరియుఁ
గాల్చి బూదిఁ జేయుచు గాయ మింత
యా లతాంగి దయావ్యాపృతాక్షియుగము
ప్రాణములతోడ త దేమి ప్రాప్తి నాకు?

ఆ మనోహారిణి కపోలస్పర్శ గావించితినో, యాజగన్మోహిని మధురామృతరసాస్వాదన మొనరించితినో, గాఢ మగు నాలింగనసౌఖ్యపరిష్వంగ మనుభవించితినో, చివర కా పద్మరాగ కరాంభోరుహము నంటితినో వచ్చిన, నా మనస్సున కింత వేదన యుండెడిది కాదు.

ఏ ప్రశీతలవాఃకణ శ్రీపరీత
మైన నిమిసంబునందు నా యంగ మంటి
పరివర్ధితనూతనందనస్పర్శశీత
మైన నీ మేను స్పర్శసౌఖ్యం బొసంగునో ?

యని చినాఁకని వచ్చితిని. ఆమె రసికురాలయిన నా మాటలలోని రహస్యము దెలిసికొనదా? అప్పుడు నా భావోన్మాద మా జవరాలికి బోధపడదా ?

ఊరక నాకుఁ బిచ్చియాలోచనలే కాని. యామె యప్పటిస్థితిఁ జూచిన నా మనోరథము కొనసాగునట్లు లేదు. నే నామెను స్పృశింపఁబోయినప్పు డా పొలంతుక స్త్రీసహజమైన సిగ్గుచేతఁ గంపించినట్లు లేదు. నిజముగా తన పాతివ్రత్యము పాడైపోవునేమో యని భయబడినట్లున్నది కాని—

నా యప్పటిమాటలామె కసలు వినంబడెనో లేదో! అకటా! నా దౌర్భాగ్య మే మని చెప్పుదును!

కీచ: అవి యంతియ కాను. కామోద్రేకమును గూడ సూచించుచున్నవి. ఆయమను గురించి నీకేమైన ననుమానములున్నవా?

వ: ఆమె దేవకాంత కాని యాలభ్య కాదు.

కీచ: ఏమో చెప్పుము.

వ: ఆమె రాత్రులందప్పుడప్పుడెచ్చటికో పోవుచునే యుండును.

కీచ: పతులు గంధర్వులంటివే! వారును నీమెయు నేర్పఱచుకొన్న సంకేతస్థాన మేమో!

వ: అయిన!

కీచ: అప్పుడామె శీలమును మనమెట్లు శంకింపగలుగుదుము.

వ: కాని పతులతో నర్ధరాత్రము నిశాకాలములందుగా స్వైరసంచారము చేయుట మాని యున్నదా?

కీచ: అది కాదు! ఆమె సనర్తన కొట్టిదో తెలియుటలేదు.

వ: నిజమైన మాటకిట్టుంటి స్త్రీకి గంధర్వు లెందరు భర్తలు కాగలుగుదురు.

కీచ: ఎందుచేత?

వ: ఈ మాత్రము సౌందర్యమునకా?

కీచ: ఈ మాత్రము సౌందర్యమునకా! పిల్లా! స్త్రీల సౌందర్యము స్త్రీలకు దెలియదు.

వ: అయినను గంధర్వులు మనుష్యుల కెట్లు పతులు కాగలుగుదురు?

కీచ: ఆమె సౌందర్యమునకు గంధర్వులే కాదు. త్రిలోకాధిపతులు గూడ తల లొగ్గవలె.

వల్ల: మీ రెన్నైనం జెప్పుడు. ఆమెను గురించి నాకను మానము పోలేదు. వ్రతములని, నియమములని కామాధ్యాయంబులు కౌపీనంబులు ధరించువారు కేవలము గాని యోగ్యులగు మనుష్యులే.

కీచ: మా యక్క సుదేష్ణ యెక్కడ నున్నది ?

వల్ల: ఆమెతో సైరంధ్రి యేమి చెప్పినదో, పట్టపు దేవి తనకై వెతుకుచు వచ్చినది. నేను మిమ్ము వెదకి తీసికొని వచ్చెదను, మీ గంధర్వపు మాటలను పలుకడని యామెను బాధించి వచ్చితిని.

కీచ: ఏమి చెప్పియుండును ?

వల్ల: ఏమి చెప్పియుండును, ఇదియే.

కీచ: మా యక్క యేమనుచు యున్నది?

వల్ల: దేవిగారికిఁ గోపము వచ్చినట్లున్నది.

కీచ: కోపమే!

వల్ల: రంగు పోదము. ఆమెను ప్రసన్నను జేసికొనుముగాని.

కీచ: వల్లకీ! నే నింతుండ్రి కదలంజాలను.

వల్ల: అయిన నేను బోయి యామెను మీయెడలఁ బ్రసన్నను జేసెదను.

కీచ: ఎట్లు

వల్ల: ప్రభువులు నిస్పృహులై యీ పూవు టేరమ్మునఁ బడిపోయి రని, పిలచిన పలుకుట లేదని చెప్పెదను. అప్పు డామె కోసము పోవును.

కీచ: సఖీ! నే నిందే పండుకొనెదను! పొమ్మ!

(నల్లకి నిష్క్రమించును)

కీచ: (ఆలోచించుచు)

చారుమంగళసర్వావయవ సుయావి
ఓ సుస్మితముఖ నీలాబ్జమాలా మధురిమ
పట్టువడెతి నచిరకేశపాశ వాంఛ
ఆ లలితకైశికము బంధమయ్యె నాకు!

ఆమె సైరంధ్రి యని కాని, యింకేమియుం దెలియదా? అంతటి యజ్ఞాతావస్థ యేందులకు? ఆమె భర్త లెవరుగా? ఈ కథ యేమో స్మృతికి దెప్పుచున్నది. ఆమె యెవరైన నేమి? ఆ మనోహారిణికి నాయెందు దయ లేదుగా!

గాఢపరిష్వంగకలితసౌఖ్యాంభోధితరంగలు తన్మయానందమగు
తత్కరస్పర్శ మెత్తమ్మలై గుమిరెడు పులకలు నొసంగు భాగ్యము లగు
మత్ప్రగంతమ్ముల మసృణచంచలవినీలాపాంగముల్ ప్రసరించు లగు
నా మూర్తికా చిరంటీమందహాసచంద్రికలు మున్నాడుచు దీప్తి కలిగను
ఆ విలాసిని పయ్యెద యుండె నాకు
లేఁబవల్ నిద్ర లగు నామె మృదుమహత్
సుప్రసన్నాననప్రభాజ్యోత్స్న యుండ
యీ హృదయతాప ముడుగున దేమి నాకు.

నా ప్రాణములు జివ్వున లాగుచున్నవి. కొంచెపు విశ్రమించెదను. (పండుకొనును)

(ప్రవేశము — సుదేష్ణ-నల్లకి)

సుదేష్ణ: నల్లకీ! తమ్ముం డెచ్చట?

న: అమ్మా! ఇటునిటు ఇదిగో యీ లతాసెజ్జయొకను నొద్ద నొడలు తెలియక పడియున్నారు.

సు: (చూచి) హాయనా! సింహబలా!

న: అమ్మా! నేను బిలచితిని. పలుక లేదు.

సు : అయ్యో! ఇదియేమి! దీనికి కారణము?

వ : ఎట్లు తెలియఁగలగు.

సు : వైద్యుని బిలువనంపి నిపుణ్ణ నీవుపొమ్ము.

కీచ : (లేచి) ఏమన్నావు 'అంతఃదయ' ఎవరా వైద్యుడు? నీవాడుకొనుచున్న మాటలు నేను వినుచునే యున్నాను. సిగ్గువలన మాటాడలేదు. నా యీవ్యాధికిఁ జికిత్స చేయించ నొకఁడవేల యీవెజ్జు నెవరో పిలుచుకొనిరమ్ము లేల?

సు : ఇంక నెవరో ధ్రోణియా? పరకాంతలపై నింత మరూహగల నీవు బాగుపడవు. నైరంధ్రి నెవతననుకొంటివి? మత్స్యదేశాధీశుని యంతఃపుర పరివారిక. ఆమెమీఁద నీగ ర్వాలినచో విరాటనృపతికిఁ దలఁవగాని తలవంపు. మత్స్యదేశ మునకు నీ వండ యనుమాట నిజమే. నీ యండ దేశకి మాకు! ధర్మము నడుపుటకు; న్యాయము దీర్చుటకు. రాజులు గలరు. రాజాంతఃపురములు గలవు. ఇట్టి యపభ్రంశపను లెందును జరుగవు. నా గోత్రములోఁ బ్రాణముండువఱకు నీ కా స్త్రీ లభింపదు. నీయంత బాహుబలశాలులు కాకపోవచ్చును గాని నాభర్తయుఁ బుత్రుఁడును నంత తేజోదర్పిదులుగారు. నీకు నిజ ముగా నా లతాంగిమీఁదనే యభిప్రాయముండెనా మొట్ట మొదట మత్స్యదేశమును భిన్నము చేసి మాయందఱ కుత్తుకలు గోసి యనంతర మామెను హరించుకొని పొమ్ము. (నిష్క్రమింతు)

కీచ : హా! హా! ఇవి యేటి మాటలు. అక్కా, నన్ను రక్షింపు మని కాళ్ళఁబడితినిగాని యధికారము జూపించితినా? ఆమె కంతతొందర యెందులకు! ఈమన్మథానల మోర్చుకొన లేక నే నుండగాఁ ద న్నే మంటిని?

విరాటనృపతి నా వలననే బ్రతుకుచున్నాఁడా? నేనే యతని రక్షించుచుంటి నని యెఱిఁగినా?

ఈ మహాంభోధిఁ దరిగాంచుట యెట్లు? అబ్బా! శూలములవంటి మాటలు! ఆమె సందాకఁ బడలిపెట్టినను తెరువయింతే పుట్టమసి గదా! నిజముగా రాజ్యమునకేయు నా భుజబలము మీఁదనే యాధారపడి యున్నను నేను వారికి సేవకుఁడనయి యేయుందును గాని రాజసప్రపోకడలు పోను.

అక్కా! ఇంతమాత్రమున తెలిసికొనలేకపోతివి. సింహబలుఁడు నేఁడో రేపో యీ మన్మథానలమునఁ బడి నశించిపోయి నప్పుడు శత్రువులు మత్స్యదేశము నాల్గువైపులనుండి చుట్టుముట్టినప్పుడు, నామాట నీకు జ్ఞాపకము రాఁగలదు. అపుడను కొందువు, 'అయ్యో! అంత వీరుఁడయిన తమ్ముని చేతులారఁ జంపుకొంటిమే' యని. అప్పుడు మీ కెవరు సాయపడుదురు? సైరంధ్రిపతులైన గంధర్వులు వచ్చి సాయపడుదురు గావలయు.

వ: స్వామీ! నిరాశఁ జెందకుఁడు.

కీచ: మొట్టమొదట నీ మాలిని వచ్చి కొలువునఁ బ్రవేశించినప్పుడు నీవున్నావా?

వ: చిత్తము.

కీచ: అప్పుడీమె యేమని చెప్పి ప్రవేశించినది? అప్పటి మాటలు జ్ఞాపకము చేసికొని యొక్కొక్కటే నెమ్మదిగ నన్నియుఁ జెప్పుము.

వ: తనపేరు మాలిని యనియుఁ దాను కూడు బట్ట యిచ్చిన సేవఁ జేసెద ననియుఁ నీచవృత్తిఁ జేయ ననియు తా

నొక్క సంవత్సరమునకన్న నిండదని సరియుఁ జెప్పినది.

కీచ : ఒక్క సంవత్సరమేనా ! తరువాత!

వ : తవన్నిరోషు తెలంగో సంఘసభలోఁ దన్ను దలపెట్టి కొని యూరేగించియు, పిసంవత్సరమైనతరువాత తనకు మంచి కోటులు ఇచ్చు ననియు - అప్పుడా పగ తీర్చుకొను నంట.

కీచ : ఇది నా కొకవిధముగాఁ దోచుచున్నది.

వ : ఏ విధముగా?

కీచ : వల్లకీ! మాయింట్లో నాగన్న మాటలు నీవిన్నియు వినావుగద

వ : చిత్తము

కీచ : మఱి యేమిగతి ?

వ ; ఈ కార్యభారము నామీఁద వేయుఁడు.

కీచ : నీ వెట్లు చేయఁగలవు ?

వ : దేవరవారి కడనుండియున్న నాకు యెంతసేపు?

కీచ : ఎట్లో చెప్పుము.

వ : సైరంధ్రి యార్ధరాత్రములయం దప్పుడప్పుడు దెచ్చటికో వెళ్లుచుండు నని మీతోఁ జెప్పితిని. ఇప్పుడు దేవిగారి వద్దకు బోవుచుండ దోవలో నామె కనంబడఁ నడిగితిని.

కీచ : ఆమె యేమన్నది?

వ : ఏమన్నది! మొగము వెలకిల వేసినది. మఱల వెలివి తెచ్చుకొని అది నీ కెందుకు, అన్నది. ఇది యంతయు నేను బయట పెట్టనా యని బెదరింపగా చెప్పుకొనుము. నా భర్తలవద్దకుఁ బోయితి నన్నది.

కీచ : మఱి యట్లయిన నీ కేమంటావు ?

వ : స్వామీ! అదే నా సమస్య. నిజముగా నా మెభర్తలవద్దకే పోయెదనని యామె మొట్టమొదటనే నిక్కచ్చిగా చెప్పినది. మొగము తేలవేయవలసిన యవసరమే లేదు. ఇక తరువాత ముఖము త్రిప్పుకొని యున్ననాట.

కీచ : సరి, దానికేమి! నీ విప్పు డీకార్య మెటుల సాధించగలవు.

వ : ఆమెను మీ యింటికి పంపించెదను.

కీచ : (ఆశ్చర్యముతో) అది యెట్లు సాధ్యము?

వ : సుదేష్ణాదేవికి మీరన్న మిక్కిలి యిష్టము. తమ యింట దొరుకునంత మంచిమదిర భూమండలమున నెందును లేదుగద. కావున మీయింటనుండి మదిర తెప్పించుమని నేన చెప్పెదను. తరువాత నే నేదో పనిమీద నున్నట్లు నటించి సైరంధ్రి నీపనిమీదఁ బంపించెదను.

కీచ : ఆమె రాదేమో!

వ : అయ్యా! ఇది సేవావృత్తి. దారిలోఁ ద్రాచుపాము కాపువేసికొని కూర్చున్నదని తెలిసినను వెళ్ళితీరవలెను!

కీచ : వల్లకీ! అంతమోస మెందులకు?

వ : దేవరవారి చిత్తము.

కీచ : ఆహా! ఇదేమి?

ఒక యొషనిది న్యాయ్యము కా
దు కాదనియె యంతరాత్మ దూషించెను త
ప్పక చేయుచున్న పనులు
పెకలించెడినో మరుండు పీతనయుండై

వల్లకీ! నీ యీమోసము సుదేష్ణాదేవికిఁ దెలిసినచో!

వ: ఆమె మీ మీఁద నిప్పుడు కోపగించి పోయినదా? ఇదే యామె నీ రాత్రియెల్ల వేధించును. ఆమెకు నిద్దుర పట్టదు. "అయ్యో! సింహబలు నన్నెందుకంటి" యని తహతహ పడుచుండును. అప్పుడు కొంచెము మద్యము త్రాగి నిదురించిన శాంతిగా నుండు నని చెప్పి మత్తుపదార్థము గలిపి యామెకుఁ ద్రాగించెదను.

కీచ: సైరంధ్రి నీమాటలమీఁద రాక సుదేష్ణాదేవి యాజ్ఞ పుచ్చుకొని గాని రా నను నేమో.

వ: ఆ మత్తులో దేని ప్రతిదానికి ఊఁ, ఊఁ, యని యంగీకారమే.

కీచ: తరువాత నది యామెకుఁ దెలిసిన!

వ: ఒక్కసారి సైరంధ్రి తమ యింటికి వచ్చిన తరువాత నావిషయమునుఁ గూర్చి యామెతోఁ జెప్పునది యెవరు? సైరంధ్రి యేమంత చిన్నదా? తానున్న సిరికి మోకాలడ్డు పెట్టుటకు. ఆయింటి రాజభోగముఁ జూచి యామె మఱల నీ యంతఃపురమునకు వచ్చునగద.

కీచ: నల్లగా! మఱి సైరంధ్రి యెప్పుడు వచ్చును?

వ: ఈరాత్రి వచ్చునో చూడో! తెల్లవారు వఱకుఁ దమ గడప దగ్గర నామె యుండఁగలదు.

కీచ: ఇది నిజమేనా!

వ: సంశయము లేదు. సెలవు.

(నిష్క్రమించును) (తెర)

# తృతీయాంకము

### ప్రవేశము — సుదేష్ణ

సుదేష్ణ : నే నన్నిమాట లనినను జవాబుకూడ చెప్పలేదు. నాయం దెంతవినయముండెను. అట్లని నూరక పట్టుకొని యెన్నిమాటలు, ఎట్టెట్టిమాట లంటిని. ఇతడేమి ధూర్తముగాఁ బ్రవర్తించెనా?

అతని భుజాబలమున మత్స్యదేశములు శత్రుభీకరముగా నున్నవి. మత్స్యదేశములు ధర్మభూయిష్ఠములన్నచో నదియు నాతని భుజోపార్జిత పౌరుషమువలన. అతఁ డన్న నా మనోనాథునకు నెంత గౌరవము! అతని నంతగా నుపాలంభించుట తప్పే.

అయినను నంతమాత్రము ననవలసినదే. అతఁడు నామాట లెక్కసేయఁడా? చేయఁడా? మాలినివిషయమున దుష్టముగాఁ బ్రవర్తించవలె. అది యెన్నటికిని జరుగనేరదు. జరిగినచో నిక నాది యంతఃపుర మేమిటి? ఇతఁ డేమిటి? ఉత్తరుఁ డైన నిట్టి పని జేసిన నిందార్హుఁడు. శిక్షార్హుఁడు.

ఎంతగా నిశ్చయించుకొనినను నతని నిట్లు పలికిన తరువాత నా మన స్సెంత శాంతముగా లేదు.

వల్లకి ప్రవేశించును.

సు: వల్లకీ! మా సింహబలుఁ డేమైనాఁడు?

వ: వారియింటికి వెళ్ళినారు.

సు: నే నట్లనఁగా నే మన్నాఁడు?

వ: పాపము, కళ్ళనీళ్ళు పెట్టుకొన్నాఁడు.

సు: అయ్యో!

వ : మీరు రప్పూ డెటువంటిమాట లన్నారు. వారు చాల మంచివారు గనుకనే యూరకొన్నా రని నాయుద్దేశ్యము.

సు : ఊరకొనక యేమిచేయు నందువు?

వ : దేవిగారిని వా రేమి చేయఁగలుగుదురు? వారికిఁ గోపము వచ్చెడిదే యింకొకరై నచో.

సు : అవును. అతనికిఁ గోపము రాలేదు.

వ : మీరు వచ్చినతరువాత "వల్లకీ! మాయక్కగారు మాచెవిని నా నన్ని ట్టిమాటలన్నదో! ఛీ! యింక నా బ్రతు కెందుకు! ఆమెచేత నిట్టిమాటలు వడి నే నీ యంతఃపురమున నుండుటకన్న సిగ్గుమాలినపని లే" దని వెళ్ళిపోయినారు.

సు : ఇంక నిక్కడకు రాఁడా యేమి?

వ : ఏమో !

సు : అతఁ డీ పాటి కెంతదూరము వెళ్ళి యుండును?

వ : రథ మెక్కి వెళ్ళిన నాయన యెంత దూరమైన వెళ్ళును.

సు : వల్లకీ ! నిజముగ సింహబలునకుఁ గోపము వచ్చినదా ?

వ : కోపము నాకుఁ దెలియదుగాని దుఃఖము వచ్చినది.

సు : అది సరియేకాని పాప మా పతివ్రతజోలి తన కెందుకు?

వ : అమ్మా? ఎవ్వరి సంగతు లెట్టివో! అందఱకు నెట్లు తెలియును.

సు : నాకీ నాఁడు తలనొప్పిగా నున్నది.

వ : అది తలనొప్పి కాదు.

సు: మఱి యేమి?

వ: కీచకమహారాజుగారి యన్యాయ్యమునకు నట్లంటిమే యని తమ మనస్సులో నున్న యాందోళన.

సు: కావచ్చును.

వ: కొంచెము విశ్రమింపుఁడు.

సు: (పండుకొనును.)

వ: అమ్మా! ఇప్పు డెట్లున్నది?

సు: వల్లకీ! సైరంధ్రిని బిలువుము.

(వల్లకి నిష్క్రమించును.)

సు: సైరంధ్రి గొంతుక యెంత మంచిది! సంచుగీచి ట్లుండను. సంగీతము విన్నచో నా తలనొప్పి తగ్గు నేమో! సైరంధ్రి యెవ్వరో! ఆమె రాజాంతఃపురముల సేవఁ జేయుటకుఁ దగనిది. ఆమె కేమైన పని జెప్పవలె నన్న నాకుఁ దల కొట్టుకొన్నట్లుండును.

వ: (ప్రవేశించును.)

సు: సైరంధ్రి యేది?

వ: వచ్చుచున్నది.

సు: (స్వ) ఆమె పట్టమహిషి యగుటకు యోగ్య. నడచుచున్నప్పుడు కలహంసవలె నుండును. తొందరగా నడువనే లేదు.

సైరంధ్రి: (ప్రవేశించి) దేవిగారు నన్నుఁ బిలువనంపిరి.

సు: అమ్మా!

సై: ఈసంబోధనమే నీయాభిజాత్యముఁ జెప్పుచున్నది.

సు: నాకుఁ దలనొప్పిగా నున్నది.

సై : ఏమైన శ్రమ గలిగిన దేమొ.

సు : ఏమియు శ్రమ లేదు.

సై : గాలి యంతబాగుగ లేదు చలిగాలి వీచుచున్నది.

సు : మబ్బులు బాగుగాఁ బట్టిన ట్లున్న వే.

సై : కొంచెము సన్నని తుప్పర పడుచున్నది.

సు : వల్లకీ! నీవు కప్పటితీసికొని రమ్ము (వల్లకి నిష్క్రమణ.)

సై : ఎండచేత వచ్చినట్లు తలనొప్పి?

సు : వల్లకి కప్పటిఁ దెచ్చినదా?

వ : (ప్రవేశించి) ఇదిగో! కప్పుకొనుఁడు.

(సుదేష్ణ కప్పుకొనును)

సై : (స్వ) బంగరుజరీయంచు గల నిసేలువ కప్పుకొన్న నీమె సూర్యకిరణములు వ్యాపించి తళతళలాడు తెల్ల మొగిలుచేఁ బ్రకాశించు సంధ్యావతివోలె నున్నది!

సు : (వల్లకితో) నీవు వెళ్లుము. (వల్లకి వెడలిపోవును.)

సై : మొగముమీఁదకూడఁ గప్పుకొనుఁడు.

సు : ఊపిరాడదు. నా తలనొప్పి యుపశమించుటకేదైన సఁబాడి వినిపించుము.

సై : వర్షర్తువును గూర్చి పాడుదునా?

సు : పాడుము.

సైరంధ్రి :

స్ఫారభవత్కేశభారాయతోత్తాల కాదంబినీస్నిగ్ధకాంతి యగుచు
మసృణకేశవిబద్ధకుసుమమాలాయితసౌదామనీప్రభాజాల యగుచు
అతినిరంతరపతత్ ద్రుతవర్షబిందు సంపూరంబున రసార్ద్రమూర్తి యగుచు
శ్రీబలాకావధూటీబద్ధమాలికోద్యన్నూత్నమౌక్తికహార యగుచు

పతి పరిష్వంగమున కయి బహలి యుండి
క్రొత్తగా వేషమును గూర్చుకొన్న వధువు
వలె వినూత్న భావములందుఁ దొలుకులాడు
వారిబిందుల కన్నీట వర్షఋతువు.

సు: తలనొప్పి కొంచెము తగ్గినట్లుగా నున్నది. ఇం కొకగీతమును బాడుము.

కడిమి పూచినదో లేక చిగిర్చెనదో యంచుఁ దొంగి చూచినది విద్యుల్లతాంగి
యెదురుగానడుదెంచు భృంగమ్మునకు స్వాగతమ్ము పాడినది మందారమహము
పతిసంగమార్ధమ్ము పరువులెత్తినది శైలాగ్రనిర్ముక్త నిర్ఘరాబ్జనేత్రి
సిగ్గుచెందినది పచ్చికబయలు తృణపుఁ బులక లంచనట్టి పుడమిపడతి

నవజలదమాల చేయు గానంబులకును
నవమయూరాంగనలు సల్పు నాట్యములకు
భరతశాస్త్ర దేశికావళి పాత్రకాల
వోలెఁ జూడ ముచ్చటయయ్యెఁబో వనంబు.

ప్రథమవర్ష బిందువుల పైఁ బట్టువడిన
ప్రకృతి యేవిధమ్మున మఱల్చుకొన లేక
యా బలాక లాకాశపుఁ టెల్లలందు
వందనాబద్ధ శ్రేణులై మెలఁగు.

శ్రావణము చేతి నిల్లు యాషాఢమాస
బహుళపక్షమ్ము హరియింపఁబడియె నేమొ?
యెంతదళ మయి క్రమ్మిన వీ జలదము
లమృతనిష్యందములు హృదయాంచలములు

నవవయఃప్రౌఢ లైనట్టి నాతుకలు వ
సించు నీ సౌధపుగవాక్షసీమలందు
నీ జలదశకలరమణీయములను
బహుమనోజ్ఞము లగరుధూపములు గ్రమ్మె

ఏమిరా! ఈమె నిద్రపోయినదా యేమి? నే నింకిందుండి పోయెదను.

సు : (అర్ధనిద్రలో) సల్లకీ! కీచకుని బిలుచుకొని రమ్ము.

సై : (బెదరి. తనలో) ఇదేమి? అతని పేరిప్పు డెందులకు? (ప్ర) అతం డిప్పు డెందుకు?

సు : (అర్ధనిద్రలో) అతని నే ననరానిమాట లంటిని. సైరంధ్రి మాటలు వినిపించెను.

సై : సైరంధ్రి యబద్ధము చెప్పిన దందురా?

సు : (అ-ని-) ఆమె యట్టిది కాదు.

సై : (స్వ) ఈమె బెదరుచున్నది. పాపము; ఈరాజ్యము వాని భుజబలముమీఁదనే యాధారపడియున్న దఁట. అతఁడు పోయిననేమి? సుదేష్ణా! నీకు వచ్చిన భయము లేదు. సంవత్సరము నీరాజ్యమునఁ దలదాచుకొన్న కృతజ్ఞత మీ రాజ్యరక్షణార్థము పాండవసింహములచేత నేమి చేయించలేదు? (ప్రకాశముగ) దేవి! నిదురపొమ్ము. ఇంకొక గీతము పాడెదను. అప్పుడే చీఁకట్లు గ్రమ్మినవి.

ఈ శిశిర యామవులు సన్నయీల వేయు
ఝల్లఝల్లన తరుశాఖలందుఁ జేరి
ప్రణయినీప్రియసంకేతబద్ధతులను
నెన్నిదినములుగా నేర్చుకొన్న వగునో.

ఇంటిచూరుల నుండి స్రవించు నీటి
బొట్టు లొక్కరీతిగాఁ బడి భూమిమీద
సరి యగునెడము గలిగి నిస్వనము సేయుఁ
బుడమిపైఁ జన్నగంట లేర్పడెడు నట్లు.

అరవిరిసిన తెల్లకలువలయందు జేరి
మాటసికొనుచున్నయవి నీటిపొట్లు వరుస
నాపకొన నీటిమూలలయందుఁ జేరి
మెల్లమెడుచుఁ గూర్చున్న పిల్లపిట్టలు.

ఈమెకు నిద్రపట్టినది. నేను బోయెదను. (నిష్క్ర)

వ: (ప్రవేశించి) సైరంధ్రిపోయి ఎంతసేపైనది. మత్తుపదార్థముఁ గలిపి మద్యము సిద్ధము చేసితిని.

సు: (అర్ధనిద్రలో) వల్లకీ! నీవు కీచకుని యింటికి బొమ్ము

వ: మద్యము తెమ్మంటారా?

సు: (అర్ధనిద్రలో) మంచి మద్యము దీసికొనిరా!

వ: తీసికొని వచ్చితిని. పుచ్చుకొనుఁడు.

సు: నాకుఁ గన్నులు తెరువ వీలుపడుట లేదు. నీవు నన్ను నెమ్మదిగఁ ద్రాగింపఁ బెట్టుము.

వ: (అట్లు చేయును)

వ: ఎట్లున్నది? ఇది మీతమ్ములు కీచకమహారాజుగారి కొరకుఁ జేయఁబడినది.

సు: (పండుకొనును)

వ: ఇంకఁ గొంచెము తెప్పించరా?

సు: ఊఁ_

వ: సైరంధ్రి వెళ్ళితీసికొని వచ్చెద ననుచున్నది.

సు: ఊహూ.

: ఆమెయే వెళ్ళెద నన్నది.

సు: ఊఁ

వ: సైరంధ్రి యిప్పు డేమి చేయఁగలదు? నేను ముందు వసారాలో నిలఁబడెదను. సైరంధ్రితో నెమ్మదిగా మాట్లాడ

వచ్చును. నేను రాకముందే యీమెకు నిద్రపట్టినది. సింహబలునితో సైరంధ్రిని నేనడుగనిదే యడిగితినని చెప్పితిని. కాని మిమ్మిప్పు డడిగెదను వచ్చుచున్నది

సై : (ప్రవేశించి లోపలికిఁ బోఁబోవును)

వ : దేవిగారు నిద్రపోవుచున్నది. ఎవరిని లోనికి రానీయ వద్దన్నది.

సై : సరే (తిరిగి పోఁబోవును)

వ : మాటమ్మా! ఏమంత తొందర! ఇప్పుడెంత ప్రొద్దుపోయినది.

సై : ఒకజాము ప్రొద్దుపోయి యుండవచ్చును.

వ : ఇప్పుడు నీవు నడచి యొంటరిగా నెక్కడికైనఁ బోఁగలుగుదువా?

సై : ఎందుకుఁ బోవలయును?

వ : కాదు, వెళ్ళవలసివచ్చినచో వెళ్ళఁగలవా?

సై : నీవన్నమాటలు నా కర్థముగాలేదు.

వ : అదికాదమ్మా! నీకు భయము లేదా యని.

సై : నీకు భయము లేదా?

వ : నాకు భయము గనుకనే నీవు వెళ్ళఁగలుగుదువా యని యడిగితిని.

సై : నాకును భయమే.

వ : అవసరమైన పనియున్నచో?

సై : తప్పనిసరికిఁ బోవుదునుగాని భయపెట్టును భయమే

వ : నీకు భయములేదు. నీవు రాత్రులందెచ్చటకైనఁ బోఁగలుగుదువు.

సై: ఈ చమత్కారము బాగున్నది.

వ: ఎందుకన్నావు కోపమా? నీకు భయములేదని నాకుఁ దెలియును గాన నే చెప్పితిని

సై: నీ కెట్లు తెలియును?

వ: అప్పుడప్పుడు నీవు రాత్రులందు నొంటరిగా మే మందఱము నిద్రపోగాఁ జూచి పోవుచుందువుగా!

సై: అవును. పోవుచుందును.

వ: అందుకనియే భయము లేదన్నాను.

సై: ఊఁ. భయము లేదు.

వ: ఇటువంటి రాత్రులయందుఁ గూడ భయము లేదా?

సై: ఏమో యని సీ కెందుకు?

వ: మన కేమి మాటలు లేవా? విరోధమా మనకు? అట్లు మాటలాడెద వేమమ్మా?

సై: చెప్పఁదలఁచిన దేదో చెప్పుము. అనవసరప్రసంశ యెందుకు?

వ: నిన్నొకమాట నడిగెద ననుకొన్నాను. నీవు కోపపడినచో నెందుకు?

సై: అవును, ఎందుకు?

వ: నాకు నడుగవలయు ననియే యున్నది.

సై: అడిగిన నడుగుము. లేదా లేదు.

వ: నీ వట్లు పోవుచున్నది యెక్కడకు?

సై: నా భర్తలు గంధర్వులైదుగు రుంటిరింటి నే, బాహుబలతృణీకృతనిఖిలశాత్రవవీరులు! వారియొద్దకు.

వ: అబద్ధము.

సై : నోరుమూయుము.

వ : ఓయబ్బ! మిగులుమాట లెందుకు? నీ విప్పుడు తక్షణముఁ గీచకమహారాజుగారి యింటికిఁ బోయి సుదేష్ణాదేవికి మద్యముఁ దీసికొనిరానలయును. ఆమెకు మిక్కిలి దలనొప్పిగా నున్నది. తన్ను నెవరును మాటలాడించరా దన్నది. ఆయన గారింటివద్ద మంచిమద్యము దొరుకును. ఆయన ప్రత్యేకముగఁ దనయక్కగారి కని మదిర నిలువఁజేసి యుంచును. అది త్రావిన గాని యామెకు శిరోభారము శమింపదు.

సై : అతని యింటికి నేను బోను.

వ : ఇది పనికత్తె యనవలసిన మాటయేనా?

సై : ఇంత చీఁకటిలో నెట్లు?

వ : ఏమో! ఎట్లో!

సై : నిజముగా నన్ను దేవి యచ్చటకు వెళ్లుమన్నదా?

వ : వెళ్లు మనలేదు. నేనే చెప్పితిని.

సై : వెళ్లుమన్నచో వెళ్ళెదను. ఆమెను గనుగొని మఱి పోయెదను.

వ : ఆయమ నిద్దుర లేపన ద్దన్నది.

సై : నీమాట నేను నమ్మను.

వ : నమ్మక పోయినచో నిక్కడ నూరకే కూర్చుండి సుదేష్ణాదేవిగారికందాలోఁ బడి తినుచుండుము. వారిపనులకు మాత్రి మక్కఱకు రాకుము. నా సొమ్మేమి పోవుసది. ఆమె నీతోఁ జెప్పుమన్నది. నేను నీతోఁ జెప్పితిని. నీవు చేయుము. చేయక పొమ్ము. ఆమెచేత నీవు పనిచేయించు కొందువో

యీమె కేనీవు పనులు చేసెదవో యది మీకుఁ దెలియవలెను.

నా కేమి తెలియును ?        (నిష్క్రమించును.)

సై : ఇది యేమో పన్నాగము వన్నెను. నే నిరాత్రి కీచకునియింటికా? ఈయర్ధరాత్రమునను? పిడుగైనఁ బడినచో నేమియగుదును. హాయి! నా భర్తలు బ్రతికిపోదురు. స్త్రీచిత్తము పురుషుని భాగ్య మన్నారు. నాభర్త లిట్టి మహాపద లనుభవించుట నామూలముననేగదా !

నేఁ డింతకథ జరిగినతరువాత నన్ను వానియింటికిఁ బంపునా సుదేష్ణ? ఆమె యట్టిది కాదే! నల్లకియేమైన దుష్టపు మాటలు చెప్పి యొప్పించెనా? నల్లకి యాకోపముఁ జూచిన సుదేష్ణ చెప్పినట్లే యున్నది.

ఎఱిఁగి యెఱిఁగి పులియున్న పొదకుఁగాని కెట్లుపోగుదును? ఆహా! సేవావృత్తి యెంతచెడ్డది. నే నిప్పుడు పోకపోతినా నా భర్తల ధర్మమార్గసంచారిత్వమునకు నామూలమునఁ గళంకము రాఁగలదు. మాటనిలుపుటకై సకలరాజ్యమును దృణముగాఁ బరిత్యజించిన యుధిష్ఠిరచక్రవర్తి ధర్మపత్నినై నే నిట్టి యధర్మ మే మని చేయుదు? మరణ మైనను రానిమ్ము యజమానురాలి యాజ్ఞ చేసితీరవలయును.

ఈ యర్ధరాత్రమున నచ్చటి కెట్లుపోదును? పోదును బో! దారిలో నా కేమి? నా యీ ప్రాణము పిడుగుపడ్డినను బోదు. ఇంకెన్ని కడగండ్లు పడవలసి యున్నవో!

తీరా, యచ్చటికిఁబోయినతరువాతఁ గీచకుఁడు దుష్టుఁడై యట్లే ప్రవర్తించినఁ జేయవలసిన దేమి? నే నీయర్ధరాత్రమున నెంత

యాక్రోశించిన నెవ రడ్డుపడెదరు? ఎట్టులైన జే పుదయమున నైనచో నేమో, భారమంతయు సర్వేశ్వరునిపై వైచి పోయెదను. వల్లకి యుబద్ధము చెప్పినదేమొ. పుదేష్ణనే కనుగొనెదను.

సు: వల్లకీ!

సై: ఎందుకమ్మా!

సు: సైరంధ్రి కీచకుని యింటికి వెళ్ళినదా?

సై: (స్వ) ఇప్పటి కనుమాననివృత్తి యైనది.

సు: దాహము.

సై: తెల్లవారక ముందే పోవలయునా?

సు: ఊ.

సై: ఈ గాఢాంధకారమునఁ బోవు టెట్లు?

సు: అయ్యో! దాహము.

సై: తెల్లవారిన తరువాతఁ బోయెదను.

సు: ఊ

సై: తెల్లవారువఱకుఁ గీచకుని యింటివద్ద నుండవలయును. ఇప్పు డెంతప్రొద్దుపోయినది! అదిగో హజారమున గడియలు కొట్టుచున్నారు. రెండుజాములు దాటినవి. కాఱు చీఁకట్లు గ్రమ్మినవి.

(వల్లకి ప్రవేశించును) 926254

సై: వల్లకీ!

వ: నాతో నీ కేమిపని?

సై: మాటిమాటికి నిన్నుఁ గీచకునియింటికిఁ బొమ్మన్నది

వ: వెళ్ళెదవా?

సై: వెళ్ళ నక్కఱలేదా?

వ: వెళ్ళెదవా ? అని చెప్పుము.

సై: ఊఁ

వ: సరే వెళ్లుము.

సై: మదిరకుఁ బాత్రకావలయును. ఆయనయే యిచ్చెదరా ?

వ: ఇక్కడనుండియే తీసికొనివెళ్ళవలయును.

సై: నీవు తెచ్చిపెట్టుము.

వ: మంజీరకుని నీవే యడుగుము. కొట్టులోనుండి తెచ్చియిచ్చును.

సై: నేనెప్పుడు నిదివఱకతనితో మాటాడలేదు.

వ: ఇప్పుడు క్రొత్తగా మాటాడుము.

సై: పరపురుషులతో నేను మాటాడను.

వ: నేను?

సై: నేను వ్రతమున నుంటినిగదా !

వ: మఱి కీచకమహారాజుగారితో నెట్లు మాట్లాడెదవు?

సై: (మౌనము)

వ: నా కెందుకు ! ఇదిగో సువర్ణపాత్ర. ఇందాఁకనే తెచ్చితిని.

సై: తెల్లవారనిమ్ము.

వ: దేవిగారికిఁ దలనొప్పి యప్పటి కెక్కువ కాదా ! నీ యిష్టము. (నిష్క్రమణ)

సై: సుదేష్ణ నన్నీ పనికి నియమించినదేమి! ఏమో! ఈమె పయోముఖవిషకుంభ మేమో! ఏమి కానున్నదో !

(తెరపడును)

# చతుర్థాంకము

నిశాభాగము. ప్రవేశము. కీచకుఁడు

కీచకుఁడు: అహో కాముకినో.

అరమూఁతల కన్నులు నుం
దరవక్రాపాంగములు వృథాసంచలను
దురచేలాంచలములు నా
తరుణి హృదయభావములను దాచక చెప్పన్

నాలో నుద్భవించిన యీమహాగ్ని చాలదా! ఎందులకీ గాలి యింత నిప్పులు చెఱుగుచున్నది? ప్రియా! నీమూలమున నాకీ సర్వాసహాయాశర్వరియందుఁ గప్పుకొనుటకు దుప్పటికూడ నక్కఱలేక పోయినది.

ఈ మేఘములు బిట్టు గర్జిల్లుచున్నవి. ఇవి సింహములా యేమి? శబరకన్యకలచేత నాస్మృతమైన వనమ్మువోలె నల్లని యీ యాకాశమీ జీమూతములచేత నెంత యొప్పుచున్నది! అదిగో మెఱయుచున్నది.

ఓ జలదకన్యకా! యంద మొలుకుచున్న
నీ జఘనభాగమున రమణీయమైన
లలితసౌదామనీమేఖలానిబద్ధ
దృష్టి నగు నన్నుఁ గికురించెదేల యిట్లు?
శ్యామలమనోజ్ఞమైన నీ చక్కఁదనము
తలఁచుకొన్న కొలంది యీ పులక లెత్తు,
మోహనాంగి వింత రసార్ద్రమూర్తి వచల
కఠినతామంఘ్రముల నేల కాలువెట్ట?

మిత్రుఁడు శారద్వతుఁడు రాలేదు. నాకీ బాధయేమో యపనయింపరానిదిగా నున్నది. వానలో రాలేకయూరకున్నాఁడేమొ? మామైత్రి యట్టిది కాదే. పిడుగులుపడుచున్నను

రావలసినదే. ఎవరు? శారద్వతా! (పోయిచూచి) ఈయాకుగు గాలికిఁ దలూపు చేసికొని వచ్చినది. ఈయంధకారము వివర్షమును నా కెన్నివిధములుగా బాధాజనకము లగుచున్నవి! నా మిత్రు నేమో రాన ప్పుడు లేదు. నా ప్రియురాలిని రానిమ్మనసి తోఁచదు. ఏమో! నాకేమి తలఁచుకొనినను ప్రాణములు పోవుచున్నవి.

ఈమన్మథుఁ డింతగా నామీఁదఁ గారవములు మిరియములు నూరవలెనా? మే మేమి ధూర్జటుల మటోయి, మా మీఁద దూకెదవు నీవు?

> ఇదివఱ కెట్టివానికిని నే శరణంచు వచింప నీకుఁ బూ
> నెద శరణంబు! నవ్యనళినీదళదివ్యశరంబు నేల పూ
> నెదవు? కుమారిగంధవహనీతమహార్చులలోన నన్ను గ్రే
> ళ్చెదు సుకుమార! మార! దయలేక, కృపామతి నాదరింపవే.

అబ్బబ్బ! ఇంక నీవిరహ మెట్లాగు సైతును? నా శా జగన్మోహిని యెందుకుఁ గనంబడినదో! ఈవిరహము విరహమున ప్రాణములు త్రుంచుకొనిపోవునా యేమి?

శారద్వతుఁడు: (ప్రవేశించి) ఈ మేఘము లెంతదట్టముగా నలముకొన్నవి! మిత్రుఁడు నాకై యెదురు చూచుచుండును! ఇదియేమి! చీఁకట్లింతగా గ్రమ్మినవి! సుపరిచితములైన యీ మార్గములే నాకు దుర్గ్రాహ్యములుగా నున్నవే! అదిగో మెఱుపు! ఒక్కసారి తళుక్కుమని మాయమైనది. కాని త్రోవ మాత్రము చూపినది. ఓసౌదామనీ! నీవలన నభిసారికాకాంతల కెంత యుపయోగము! ఈ నిశాభాగము రమ్యముగానే యున్నది.

నాబట్టలు తడిసిముద్దలైనవి. మిత్రుని యిల్లు సమీపించితిని.

ఓసి సౌదామనీ! యింక నొక్కకొంచె
మింత మెఱయుము మెఱయు నీ యిల్లు వెండి
గాను బంగారమును గూడఁ గాను ద్వార
బంధ మెట నున్నదో చూపవలయు నంత.

ఎంత మంచిదానవు! సమయమునకు మెఱసితివి. అదిగో కనియే యమృతమూర్తులగు యువతీరత్నములతోఁ బోల్పదగు నిన్ను. సఖుఁడా! సఖుఁడ

కీచ: (లేచి) రావోయి సఖుఁడ! వచ్చితివా?

శార: వచ్చితిని.

కీచ: నీకోసము నిమసములు యుగములుగా గడపుచుంటిని.

శార: ఎవనికోసమో! నాకోసము గాదు.

కీచ: నిజముగా నీకోసము.

శార: నే నేమి స్త్రీనా?

కీచ: ఓయి స్నిగ్ధుఁడా! కాలము గడచుటలేదు. నీవు వచ్చిన గడమునుగదా యని

శార: నేను వచ్చిన గడమునులే. అసలు గడచినది నా కోసముకాదుగద.

కీచ: మిత్రమా! కూర్చుండుము. ఇప్పటి కెంత ప్రొద్దు పోయినది.

శార: రాతిరి రెండుజాములైనది.

కీచ: ఇంత చీఁకటిలో నెట్లు వచ్చితివి?

శార: నే నొక్కఁడనే రాలేదు.

కీచ: మఱి యెవరితోఁ గలసి వచ్చితివి.

శార: ఒక ఖేచరాంగనతో.

కీచ: ఆమె యెచ్చట? ఏదీ?

శార: ఇంతవఱకు వచ్చి వెనుదిరిగి పోయినది.

కీచ: అయ్యో! ఆమె యెట్లున్నది? ఎవ రామె?

శార: ఎట్లున్నది? ఎవ రామె? ఎంత యందకత్తె.

ఆ లలితాంగి చారుమధురాకృతి సాటి యసంగవచ్చు శం
పాలలితాంగి, యా మధురవక్రమనోహరనీలకుంతలన్
జాలలితాంగిఁ బోల్పదగు రేకలు తెల్లని కన్నెతమ్మి యం
దాలకుఁ బుల్కలా సతి సుధామృగసంతవిలాసవైఖరుల్.

కీచ: ఆమెను నాకుఁ జూపించవా?

శార: ఎచ్చటఁ జూపింపను?

ఆకాశాంతంబుల సాంధ్యకాలముల నీలాంభోదగర్భంబునం
దా? సానందచరన్మధువ్రతకులోత్తంసాపలీగాయమా
నాకాగీతములందునా? యుదయవేళాంచత్సితాంభోద మా
కాశప్రాప్తిగసంతరోచులన,! లేకన్ బ్రేమకున్ లోనునా!

కీచ: ఓయీ! న న్నెందుకు వేధించెదు?

శార: అబ్బో! స్త్రీని జూడకయే నీ కెందు కెంత విరహము?

కీచ: మిత్రమా! అట్లుకాదు. నే నీనాఁ డొక జగన్మోహినిని జూచితిని. ఆమెయు ఖేచరాంగనయే. వచ్చినదేమో యని యడుగుచున్నాను.

శార: ఆమె యెవరో నాకేమి తెలియును! నా వెంట వచ్చిన యామెను జూపెదను. ఆమె యేమో గుర్తుపట్టుకొనుము.

కీచ: మఱి యామెను జూపింపుము.

శార : కొంచెమాగుము.

కీచ : ఆగితిని.

శార : అదిగో! కన్నులు మిఱుమిట్లు గొనలేదా!

కీచ : (నవ్వి) అవును! ఆమెయు నిట్లే యుండునుగాని, యామె మాత్ర మామె కాదు. ఆమె భూసంచారిణి.

శార : భూసంచారిణి కొఱ కేనా యింతయవస్థ.

కీచ : సఖుఁడా! అట్లుకాదు, అట్టి లతాంగి నెవ్వరును నెవ్వారును జూచియుండరు.

శార : ఆమె యే కెచ్చట కనంబడినది.

కీచ : రాజాంతఃపురములో!

శార : ఆమె యెవరు?

కీచ : ఎవరో గంధర్వుల భార్య యఁట.

శార : మిత్రుఁడా! అట్లైన నా యోజన మానుము.

కీచ : ఎందుచేత.

శార : నీవు భూసంచారివి. వారు ఖేచరులు.

కీచ : ఓయి పిచ్చివాఁడా!

శార : నీవు మహానుభావుఁడవు. అందుకుఁ గాదు. కొంచె మాలోచించితివా యని.

కీచ : ఆలోచనలైనవి. అన్నియునైనవి. నా ప్రాణములు మాత్రము నిలుచునట్లు లేదు.

శార : అందుకు నే నేమి చేయుదును?

కీచ : తమ్ముఁడా! పరిహాసములు మాని యేదైన కథయైనను జెప్పుము!

శార : ఏమి చెప్పు మందువు?

కీచ : నీ యిష్టము,

శార : నాకొక్కటే కథ వచ్చును.

కీచ : అదియే చెప్పుము.

శార : అనఁగా అనఁగా ఒకరాజు.

కీచ : ఆరాజున కేడుగురు కొడుకులా ?

శార : కాదు. నలుగురు.

కీచ : తరువాతఁ జెప్పుము.

శార : ఇప్పుడు మనకథ యొక్కనితోనే.

కీచ : ఊఁ.

శార : ఆయొక్కఁడు భార్యతో నడవికి వెళ్ళవలసి వచ్చి నది. అచ్చట నొకరాక్షసుఁ డాయనభార్య నపహరించినాఁడు.

కీచ : ఇది నాకును తెలియును.

శార : తెలియదు.

కీచ : తెలియునయ్యా !

శార : తెలిసినఁ జెప్పుము !

కీచ : ఇది రాముని కథ.

శార : చివఱ కేమైనది చెప్పుము.

కీచ : ఇది కాదోయి! ఇంకొకటి చెప్పుము.

శార : అదిగో కోడి కూయుచున్నది. నేను వెళ్ళవల యును. వర్షము వెలిసినది.

కీచ : ఏమంత తొందర ?

శార : పనియున్నది.

కీచ : నీ యిష్టము. (శారద్వతుఁడు విశ్రమించును)

కీచ : ఓప్రియురాలా! నాప్రాణములమీఁద నీ కెందు

కింత వైరము? ఈ నిశాభాగ మెంతతీవ్రమైనది? ఇదివఱకు గడచినది యొక యొత్తు. ఇకముందు గడుపవలసినది యొక యొత్తు.

వల్లకీ! నీమాటమీఁదనే నాప్రాణము లింతదనుక నిలచి యున్నవి. నిజముగాఁ గోడికూసినదా! వర్షము వెలసినది. కోడి కూసినట్లు లేదు. కాదు, అదిగో! అవును కోడి కూసినది. ఈ కుక్కుటారావములు నా చెవుల కెంత మనోహరములుగా నున్నవి.

అవి యూనయించుసట్టి జలజాప్తుని ముంగిట మ్రోయు దుందుభుల్
నవసుకుమారమూర్తు లగు నాతుల మేల్[illegible]
ప్రవిమలరాగ మేచెడు ప్రభాతసతీమృదునూపురధ్వనుల్
కువకువలాడు జక్కవలకూతలకుఁ సయిదోడు పోడుముల్

మిత్రుఁడు వెళ్ళినాఁడు. వర్షము వెలసినదివలె నున్నది. అయినను మేఘములు దట్టపుపొగలవలె నాకాశమునందు సంచరించుచునే యున్నవి.

ఓసీ! జగన్మోహినీ! నాప్రాణము లెంత యాహరించు కొన్నావు! ఇంకను దెల్లవారదే? నీ వెప్పుడు వచ్చెదవు?

నీ విమలనాగవల్లి కౌనిభవికాస
బాహువల్లిక పెనుకువవలని సుఖము
వనిత! నా మోమునకుఁ బ్రాయఁబడని దయ్యె
నా మహాసౌఖ్యమునకె న న్నాసగొలుపు.

వల్లకి యేమి చెప్పినది? తెల్లవారకముందే పంపించెద నని చెప్పినదే! ఇంతవఱకును రాలేదా లతాంగి. ఇంక నే నేమి చేయుదును? నామన స్సింత యలజడి పొందుచున్న దేల? నా హృదయ మింత కొట్టుకొనుచున్న దెందులకు? నాకుఁగాళ్ళు చేతు లాడుట లేదు. (కూర్చుండి)

ఓయి సూర్యుడ! యుదయించెదోయి! యకట!
ప్రాణములు పోవునట యుదయాస్తమానము
లందు నీ యొక్కయును నల్ల చందమామ
యొక్కయును, ప్రాణులకు నెల్ల నుర్విమందు.

(మోహము)

(ద్రౌపది ప్రవేశము)

ఇదియె దగినకార్యమె సమర్ధించుచుంటి
సకలభూపాలకులరాజచ్ఛత్రుండ
ఆ యుధిష్ఠిరనృపతి కర్ధాంగి నగుదు
నల్ల పూలచక్రవర్తికాదె చెల్లవోవు.

ఇదియె కీచకుని యిల్లు. సర్వథా యిదియే కావలయును. ఆస్త్రీ చెప్పిన గుర్తులన్నియు నిందే కనంబడుచున్నవి. పులి దాగియున్న గుహలో మూలికై పోవుచున్న రాగివలె నున్నాను. ఏవిధమైన యాలస్యము కూడదు. అదిగో! ఆ కాముకుడగు యాతడే. ఇతనితో నేమని మాటలాడుదును?

కీచ: (చూచి) ఓహో! శృంగారరసపట్టభద్ర! వచ్చితివా!
రాఁగదవె బాల! నా యూరుభాగమందు
నీవు పూర్వమ్మె స్థిరపడెనే పదమ్ము
ఇదివఱకు నిన్ను వెదుకని యీ కుటిలుని
జన్మ నిష్ఫల మగుఁగాదె శిక్షాపథంబు.

నీ యీ యభిసారికా వేషమున నా హృదయఫలకము చిత్రకారుని పటమువలె నయినది. నీ యీ మనోహరమూర్తి నేమని వర్ణింతును?

మోహినీ! వాసలోఁ దడిమద్ద నయితి
నీ శిరమ్మున ముసుఁగైన నీలవసన
మతివ! సౌదామినీవల్లి నావరించు
చిలుమొగిలుదీతి నందమ్ము చిందుచుండె.

ఆకసమున నా సౌందర్యము, ధారుణీతలమున నీ సౌందర్యము.

వనితా! దంపతు లెల్ల నీ గతిరతాభాగంబు గాటంపు బ్రే
మను బంధింతు రొకళ్లొకళ్ళ నరశింజా మోసముల్ వోలె నా
కను లీ త్రోవను జూచి చూచి ఫలమల్ గానక్ ఒకప్పంగసం
జనితానందరసైకమగ్నుని నొనర్పన్ జూడవే యిప్పుడే

ద్రౌ: అయ్యా! మీయక్క సుదేష్ణాదేవి శిరోభారమున నందుచున్నది. మీయొద్ద దివ్యమైన మద్యము దొరకునంట. నన్నుఁ దీసికొని రమ్మని పంపినది. దయచేసి యిప్పింపుఁడు. ఆమె నాకొఱకు వేచుచుండును.

కీచ: మదిర నీవు తీసికొని పోవలయునా? ఏ పరిచారిక చేతనైనఁ బంపించెదను. ముల్లోకములకుఁ బట్టపురాణివి కాఁదగిన నీవిట్టి పనులేల చేయుదువు?

ఆశాబంధ మొకటి నన్ను వెనుకకు లాగుచున్నది. లేకున్న నే నీపాటి కెక్కడ నుండవలసినదో! ప్రియా! దయఁ జూడుము. నే నేమి యపరాధము చేసితిని. నిన్ను వీక్షించి యింక తప్పుపాటు కాలమైన నిలువఁజాలను. నన్నింత వేదపఱచిన నీ సౌందర్యము భూతధాత్రి కెల్ల నలంకార మగుచున్నది. నీ విచ్చటకు వచ్చినదే నాపైఁ గల మచ్చికకుఁ దార్కాణ.

ద్రౌ: అయ్యా! నిజముగా నేను మదిరకై వచ్చితిని. సుదేష్ణాదేవి శిరోవేదనవలన మిక్కిలి బాధపడుచున్నది. మదిరఁ దీసికొని పోయి యామె కీయవలయును. శీఘ్రముగ నన్నుఁ బంపుడు.

కీచ: ఎవరక్కడ.

సేవకుఁడు: (ప్రవేశించి) చిత్తము.

కీచ : మేలిరకపు మద్యముఁ దీయించి సుదేష్ణాదేవిగారికిఁ బంపవలయును. ఇట్లని గౌరీకంపునితోఁ జెప్పుముఁ దక్షణము పంపించవలయును.

సేవ : చిత్తము. (నిష్క్రమించును)

కీచ : చెలియా! ఇప్పటికి నీపని యైనదా? ఇంకఁగటాక్షింపుము. (పట్టుకొనఁబోవును)

ద్రౌ : అయ్యో!

కీచ : మనోహారిణీ! ఏల నన్ను బేలుపెట్టెదవు! నీవే మొయరుదెంతు వని, నా భుజపంజరమునఁ జొత్తు వని చొచ్చి నాలో నైక్యమైపోదు వని యనుకొంటిని. వచ్చినది మొదలు భ్రూభంగములతోడనే సరిపెట్టెదవు. ఏదీ! ఒక్కసారి నిన్నుఁ గౌఁగిలించుకొననిమ్ము. (కౌఁగిలించుకొనఁబోవును.)

ద్రౌ : (పరుగెత్తుచు నిష్క్రమించును.)

కీచ : (తఱుముచు నిష్క్రమించును.)

(తెరపడును)

# పంచమాంకము

ప్రవేశము - ఉత్తర

ఉత్తర : తెల్లవారినది కాని నామనస్సు నేఁడేమో సరిగాలేదు. స్నానము చేసినను గూడఁ జేసినట్లు లేదు. దిక్కులు శుభ్రముగా లేవు. తెల్లవారలు పక్షులు గూసినవి. ఆకాశమున మేఘములు లేవు. ఇదేమో ధ్వని.

ద్రౌ : (ప్రవేశించి) ఆహా! ఈ దురాత్ముఁడు నన్ను వెన్నాడుచున్నాఁడు. అయ్యో! నన్ను రక్షించువా రెవ్వరును లేరా! జనములెల్ల రూఁక భయభ్రాంతులై యాశ్చర్య నిమగ్నులై చూచెదరే కాని నన్నొకరైన నాదరించరా? ఇంతకి జక్కిసి యొకరును నన్ను రక్షింపవచ్చుట లేదు. ఏమిచేయుదును. దేవి సుదేష్ణా! నన్నింతటి యాపదలో ముంచితివి?

(నిష్క్ర)

ఉ : ఈమె కేమి సంతాపన వేళ వచ్చినది. తొందరగా వచ్చి తొందరగా వెళ్ళిపోయినది. పల్కరించుటకుఁ గూడ వీల్లేదు. ఈమెను తఱుముచున్న దెవరు? ఈ యవస్థ యేమి?

కీచ : (ప్రవేశించి) ఓహో! మాలిని! ఏల పరుగెత్తెదవు? పిచ్చిదానా! నిన్నేమి బలాత్కరింపవచ్చితినా! పరుగెత్తకుము. నిలుచుండి మాటలాడుము. పరుగెత్తుటయా యది. తొందరగా నడచుచున్నావు.

నీ జఘనభాగమున నమణీయమూర్తి!
కదలజాలవు పరుగెత్తఁగలవె నీవు?
అయిన నిడికూడ నొకరీతి నందనము
కాంత! సర్వాంగసుందరాకార వగుట.

ఆహా! ఈసతి నడక యెంత యందము!

> రమణి పిఱుదులు గుండ్రచక్రములవోలెఁ
> గిరుగుచున్నవి కామిని పరుగుఁ బరుగు
> ఆ సుదతి దేహవల్లికా యూహాప్రపంచ
> మందు మెఱుపుఁదీఁగ స్ఫూర్తిఁ దనర్చు

ఈమె యుష్ణాంతపానుగాలులకుఁ గదలిపోవుచున్న యోడవలె నెంతసొగసుగా నున్నది!

> చాలతొందరలోఁ బైట జారిపోయి
> కడఁగి దింపిన తెఱచాప కరణి నుండె
> స్థితిఁ గాను ప్రయాణీకుల రీతిఁ దల్ల
> డిల్లి పోయెను కుచములు పెల్లు గలఁగి

సుదతీ! భయము లేదు. నిలుచుండుము. ఒక్కసారి మాటలాడి పొమ్ము. (నిష్క్రమించును.)

ఉ: ఆహా! ఈదురాగత మేమి యీయనకు! సైరంధ్రి మహాపతివ్రత యఁట. ఆమె భర్తలు మహాబలవంతులఁట. పగ బట్టిన కోడెత్రాఁచులవలెఁ బ్రాణములఁ దీయుదురఁట.

ద్రౌ: (ప్రవేశించి) ఇంక నెవ్వరు నాను సాయపడు వారు లేరా! నా భర్తలే నాకీ వేళ సాయపడవలయును.

> సకలరాజన్యరత్నకిరీట సేవితపాదద్వయా! జయ! పలుక వేమి?
> నిఖిలరాక్షసగర్వనిర్భేదనమహాద్భుతవిక్రమ! జయంత! శ్రుతము కాదో
> సవ్యదోర్దండప్రచండకోదండ! యో విజయాభిధాన! యీ వేర మేల
> దివిజాశ్వగమనసన్నుతపరాక్రమశీల! యో జయత్సేన! రావోయి నీవు?

> పశుసమూహంబుగూడ నీ పశుమకరుణఁ
> దేర్చెదవు జయద్బల! నన్నుఁ దేర్చ వేమి!
> ఘన లబ్ధకీర్తిశత్రులు గారె మీర
> లూరకుండెద రేల? వే రారె! రారె!

(నిష్క్రమించును)

ఉ: ఓహో! భయంకరముగా నున్నది. ఈ శోక భయంకరమూర్తి నే నెట్లు త్రిప్పుదును? ఆ గంధర్వులు వచ్చి మా నగరముపైఁ బడరుగద!

కీచ: (ప్రవేశించి) బేలా! ఏల యీరక సలిచెదవు? ఊర్ధ్వోభారమున నడువలేని యావువోలె నేల బరువెత్తెదవు? నిన్నొక్కమాట గట్టిగా నడిగిపోయెదను! అంతమాత్రమున కాఁగరాదా!

> ఆ గమనరేఖ నన్నెంత యాహరించు!
> దూరమున కొంత సౌందర్యవారిరాశి
> ఆ మొగురుమున్న నీదు చేలాంచలముల
> వెలఁది నా ప్రాణములు ముడివేసికొందు.

ఒక్కమాట.

ఉ: నే నిచ్చటనుండి పిలచిన వారికి నా పిలు పందునటుల లేదు. సమీపించెద.

ద్రౌ: (ప్రవేశించి)

> నా నాథుల్ జగదేకవీరకములు గంధర్వాళిముల్ నా, రిపు
> ప్రాణమ్ముల్ హరియింతు రంచు దెసలన్ వ్యాపించె మీ కీర్తు లే
> లం నన్నీ గతిఁ జూచిచుండిరయును బేలల్ వోలె రాకుండి రా
> హా! నా కీదృశకష్టముల్ బలిబలీ యాజన్మ సిద్ధంబులే?

ఉ: (సమీపించి) అమ్మా! సైరంధ్రి!

ద్రౌ: తల్లీ! నన్నుఁ బలకరించకుము.

> ఏ నొకమహాపదంభోధి నీదులాడు
> చుంటి నాప్రాణములును నాయొద్ద లేవు
> హా! మనోహరులార! నే నలిచి యలిచి
> చావవలసినదేన! యీ జనువిపలన?

(నిష్క్రమించును)

ఉ: నా ప్రాణములు పోవుచున్నవి. ఇంక నాకండ్రి యీరాజ్య మెందులకు?

కీచ: (ప్రవేశించి) ఎవరచ్చట?

ఉ: నేను మత్స్యదేశాధీశ్వరుని కూతురను.

కీచ: (నివ్వెఱపోయి) తల్లీ! క్షమింపుము. వెనుదిరిగి పోవుచున్నాను. (నిష్క్రమించును)

ఉ: నే నిప్పు డేమి చేయవలె. ఇది రాజాస్థానమునఁ జెప్పెదను. రాజ్య మింత యరక్షితముగా నుండరాదు. దూరమున నా వచ్చుచున్నది యెవరు? ధారుణీశ్వరుని ప్రధానామాత్యుఁడు ప్రాతఃకాలవాహ్యాళికొఱకువచ్చుచున్నాఁడు కంకభట్టుగారు.

(ప్రవేశము కంకభట్టు)

కంక: తల్లీ! ఇది యేమి నీ విచ్చట నుంటివి?

ఉ: నే నిప్పు డొక యభ్యర్థిని.

కం: ఏమది?

ఉ: నా కొకయన్యాయము జరిగినది. అది రాజగారికిఁ జెప్పుకొనుటకు వచ్చితిని.

కం: తల్లీ! చెప్పవచ్చును.

ఉ: ఒక రాజపురుషుఁ డొక పతివ్రతాతిలకమును బట్టపగ లింతకు ముందే రాజవీధులవెంటఁ దఱుముకొని వచ్చి యామెకు మానభంగము చేయఁ బూనినాఁడు. అతనిని శిక్షింపవలె నని నా కోరిక.

కం: ఆ పతివ్రత యెవరు?

ఉ: రాజసభలో నామె పేరు చెప్పరాదు.

కం: మన మిర్వురమేకదా యుంటున్నది?

ఉ: ధర్మమూర్తులగు తమరు నిల్చినచోటే సభ యని నా యుద్దేశ్యము.

కం: ఈబిడ్డ యెంత ముద్దుగా మాటాడుచున్నది?(ప్రకాశముగ) అమ్మా! న్యాయము చెప్పుచున్నాను. నీవు సాక్షిక్రింద నుపయోగించెదవు. అట్లు పరాభవింపఁబడిన సతియే వచ్చి రాజ సమ్ముఖమున నివేదించుకొనవలయును.

ద్రౌ: (పరుగెత్తుకొనుచు వచ్చి) నా భర్తలెందున్నారని పిలుతును? ఓజయ! జయంత! విజయ! జయత్సేన! జయద్బల!

> రాజసభయందు నాకుఁ బరాభవంబు
> ఇది మొదటిసారి కాదు మీ రేమి సేతు
> రీ పరమనీచయువతి కింతే తుదిపఱ
> కంతటి మహానుభావు లీరయ్యుఁ బతులు.

ఇప్పు డెచ్చటికిఁ బోయెదను?

ఉ: అదిగో, ఆ మహాసాధ్వి!

కం: ఆమె పేరు?

ఉ: సైరంధ్రి యని పిలచెద రామెను.

కం: ఓహో! యువతి! ఏల నట్లఱచెదవు?

ద్రౌ: నే నొకమహాపదలోనున్నాను. నాపతులున్నారైదుగురు. వారు గంధర్వులు. వారితో మొఱవెట్టుకొనుచున్నాను.

కం: బాగుగనున్నది. ఊరివెంట నఱచుచుఁ బోయెద నేల? ఇది నీకుఁ దగదు. జనమెల్ల రొకవిచిత్రమృగమును జూచుటకు వచ్చినట్లు, చూడుము, నీవెంట నెట్లు పడివచ్చుచున్నారో!

ద్రౌ: అయ్యో! చూచెడివారి కేమి తెలియును, అనుభ
వించెడివారికిఁ దెలియును.

కీం: ఎంత యనుభవించినను నలుగురిలోనికి రాఁ
జెల్లదు. అందులో స్త్రీలు సత్తురా? మహాపదలో నుంటినంటివి.
మఱి నీకు శత్రువులు లేరా!

ద్రౌ: తలవెండ్రుకల యంతమంది.

కీం: మఱి వారు నిన్ను గుర్తుపట్టుదురు కాదా
ఇల్లు వచ్చుట తగదు. చూచినవా రేమనుకొందురు? ఇంత
లజ్జావిహీన యేమనుకొందురు. పైన నెదురుపడి పురుషులతో
మాట్లాడెదవు.

ద్రౌ: స్వామీ! నేను పురుషుల కెదురుపడి యేమాట్లాడు
చుంటిని.

కీం: నీకుఁ బురుషు లన్న లెక్కలేదు.

ద్రౌ: లేదు. నాభర్త స్త్రీ. జూదరి. వంటవాఁడు. పశు
వుల కాపరి.

కీం: అంత యావేశము పొందెద వేటికి? నాట్యకత్తె
వలెఁ ద్రొక్కులాడెదవు. చాలు! ఇఁక బొమ్ము, నీభర్తలు గంధ
ర్వులో! స్త్రీలో! పురుషులో! వారికిమాత్రము తెలియదా
నీస్థితి! ఇంక రాజవీథులయందు నిలువక పొమ్ము.

ద్రౌ: నేను నాట్యకత్తెనే! నాభర్త నటుఁడు. ఎట్టి
వాఁడు గాకపోయిన నాకిట్టి మహాపరాభవములు జరుగుచుండఁ
జూచుచు నూరకుండి తరువాత మాటలతో నూరడించును.
అవును! నాకేమి పసువు? పసు వేమిటి? జూదరుల భార్యలకు!
కితవుల యాలులకు (నిష్క్రమించును)

కం: అమ్మా! నీ వెచ్చటికిఁ బోవుచుంటివి?

ఉ: నర్తనశాలకు, మఱి యీమెగతి యేమి?

కం: ఆమె భర్తలులేరా గంధర్వులు? వారు వారి విధ్యుక్తములను వారే నిర్వహించుకొందురు. లేదా యూర కుందురు. ఇంతకూ నామెను వెన్నాడిన పురుషుఁ డెవ్వఁడు?

ఉ: సింహబలుఁడు.

కం: అట్టివానితో వైరము రాజ్యమున కెందులకు? ప్రొద్దుగ్రుంకువఱ కెల్ల గంధర్వులు వచ్చి యీమెను రక్షించు కొందు రనుకొందును. నీవు పొమ్ము! మేము పోయెదము.

(నిష్క్రమించును)

ఉ: వీరిరువురి సంభాషణ చాలచిత్రముగా నున్నది. ఇతఁ డేమి పుంజీభూతరాజనీతియో యేమి? ఈయనకూడ మునుపు యుధిష్ఠిరునియొద్ద నుండెడివాఁడఁట. మాయాచార్యు లీయనను నెఱుఁగు నఁట. ఆయన సైరంధ్ర నెఱిఁగియున్నప్పు డీయన మాత్ర మేల యెఱుఁగఁడు! సైరంధ్రిని గంకభట్టు నిందించినాఁ డని చెప్పవచ్చునా. ఆమెయుఁ బ్రత్యుత్తరములు చాల కోపముగానే చెప్పినది. సైరంధ్రిపతులసంగతి యీయనకుఁగూడఁ దెలియునువలె నున్నది.

గంధర్వు లీరాత్రికే వత్తురా? నృత్యశాల కరిగెదను. అందు బృహన్నలాచార్యులు చక్కని కథలు చెప్పి నామన శ్చాంచల్యము నడంచఁగలరు. మానగర మీరాత్రికే గంధర్వులకోపాగ్ని కెఱ యగునా! నామనస్సు మిక్కిలి యారాట పడుచున్నది.

మామామాను యెంతలజ్జ పడినాఁడు. ఆయనతో నేనెంత నిష్ఠురముగ మాట్లాడితిని. సైరంధ్రిమీఁద నా కింత ప్రేమ యెందులకు? నామనస్సు నన్ను సైరంధ్రియెడకు లాగుచున్నది. నాకును సైరంధ్రికి నేమి సంబంధమున్నది? ఆమెను జూచిన నాకు మాయమ్మను జూచిన ట్లుండును. మా గురువుగారు చెప్పిన మాటలవలన నది నా కామెమీఁద నేర్పడిన గౌరవము గావలయును. సైరంధ్రిమాత్ర ముత్తమకులసంజాత కాని యామె కనంబడునటుల గాదు. అప్పుడప్పు డామె మిక్కిలి దయగాఁ జూచుచుండును. ఆచూపు తల్లి తనబిడ్డమీఁదఁ బ్రసరింపవచ్చును. ఒకమహారాజ్ఞి తన పరిజనముమీఁదఁ బ్రేమ గలిగి నప్పు డట్లు చూడవచ్చును.

నే నవివాహితను. సైరంధ్రి యే రాజునకైన భార్య యేమో! ఆమె యిప్పటి యీస్థితి కారణాంతరముల చేతఁగలిగినను మఱల తన యెప్పటిస్థితిని బొందునేమో! ఆమెకు నాయీడు కొడుకున్నాఁడేమో!

ఏమిటి నాకీ పిచ్చియూహలు త్వరలో నర్తనశాలకు బోయెదను. నర్తనశాల యన్న నాకు భయ మగుచున్న దేమి? దినదినము నేను బోవునదియే గదా! ఏమిది! నా కీ యుద్దేశ్య మెందుకుఁ దోఁచవలె. అచ్చట సైరంధ్రిభర్త గంధర్వుఁడువచ్చి దాగి యున్నాఁడా! నే నింక నక్కడకుఁబోను. నేను మాతల్లి యంతఃపురమునకుఁబోయెదను. (పరిక్రమించి) ఇదిగో మాతల్లి యంతఃపురము. వల్లకీ! నేను వచ్చితినని మా యమ్మతోఁ జెప్పుము.

సు : (ప్రవేశించి) అమ్మా! నర్తనశాలకుఁ బోలే దేమి?

ఉ : నాకు నర్తనశాలకుఁ బోవుట యన్న భయము వేయుచున్నది.

సు : ఎందుచేత?

ఉ : అక్కడ నెవరోయుండి నన్ను బెదరించుచున్నట్లున్నది.

సు : తల్లీ! నీ కీ భయ మేమిటికి. పదునేనేడులు వచ్చినదానవు. ఎందులకు నీ కా భయము. అక్కడ నెవ రున్నా రని.

ఉ : సైరంధ్రీభర్తలగు గంధర్వులు.

సు : (బెదరి) వా రెప్పుడు వచ్చిరి?

ఉ : ఏమో!

సు : నేను దెల్లవారలు నిద్రించుచుంటిని. నా కెందుచేతనో నేటిరాత్రి మొదలు తెలియని నిద్దుర పట్టినది. నేను రాత్రి మద్యము ద్రావితిని. సైరంధ్రి నన్ను సింహబలుని యింటికి మదిరకొఱకు పోగునాయని యడిగినట్లున్నది. సైరంధ్రి వెళ్ళినదా? వల్లకీ! సైరంధ్రి యెక్కడ?

వ : (ప్రవేశించి) తను తమ్ముఁడుగారి యింటికి వెళ్ళినది.

సు : ఎందుకు?

వ : మీరు మదిర కొఱకన్నా రంట కదా!

సు : నేను వెళ్ళు మన్నానా? ఆమెయే వెళ్లెద నన్నదని చెప్పినట్లున్నదే నీవు!

వ : ఆమె వెళ్లెద నన్నది.

సు : నిజముగా!

వ : నిజముగానే.

సు : ఎందులకు?

వ : తమతమ్ముని యందలి మోహము చేత.

ఉ : నల్లకీ! చచ్చిపోయితివి. గంధర్వులు నీగొంతుక పిసుకుదురు.

సు : అయ్యో! నశించిపోయితిని.

వ : నాకేమియుఁ దెలియదు.

ద్రౌ : (ప్రవేశించి నెమ్మదిగా)

ఓయి జయత్సేన! ఓయి జయద్బల!
ఓయి జయంత! రావోయి విజయ!
మీయన్న జయుఁ డేమి మీతోఁ జెప్పనో?
రండయ్య కలసి విరాటపుఁ కీ

వ : అదిగో సైరంధ్రి.

సు : ఆమె యేమో గొణుగుకొనుచున్నది.

ఉ : పతులైన గంధర్వులను బిలుచుచున్నది.

ద్రౌ :

ఈ యపకృతికి నీ వేమి ప్రతిక్రియ
చేయఁజూతో జయంత! చేయఁ జూడు
ఆవాఁడు సభలోన నరులు చేసినదాని
కన్న నిచ్యాది నన్నుఁ గాల్చివైచు.

సు : ఏమనుచున్నది.

ఉ : ఏమో మంత్రములు చదువుచున్నది.

ద్రౌ :

ఓజయ! గ్రహింపు నీ పదాంభోజములకు
నా నమస్కృతు లివిగో! శాంతత్వ మెల్ల
కరఁడు గట్టె యయ్యో భవదాకార మట్లు
ఇంద్రియజయంబు లేని మే మిట్లు లుండ.

ఉ : అమ్మా! సైరంధ్రి! ఏమనుకొనుచుంటివి.

ద్రౌ : ఏ మనుకొనుచుంటిని ! రానున్న యాపదలు రత్నపంజరములో నున్నను వచ్చునుగదా యని.

ఉ : ఇంతవఱ కేమి చేయుచుంటివి ?

ద్రౌ : నెమ్మదిగా వచ్చుచుంటిని.

ఉ : ఏ త్రోవమీఁదుగా వచ్చుచుంటివి ?

ద్రౌ : నర్తనశాలమీఁదుగా !

ఉ : అమ్మా ! నన్నుఁ బట్టుకొనుము.

(నల్లకి ఉత్తరను బట్టుకొనును)

ద్రౌ : దేవీ! ఏమి బిడ్డ యట్లయినది.

సు : అది నర్తనశాలవద్ద నెవరినో చూచినదఁట.

ద్రౌ : ఎవరిని ?

సు : నీకు దారిలో నెవరును గనంబడలేదా ?

ద్రౌ : నాభర్తలగు గంధర్వులలో నొకరు కనంబడినారు. బిడ్డ కంతభయ మెందుకు?

సు : నాకే భయమగుచున్నది. బిడ్డ కింకెంతభయ మగుచున్నదో!

ద్రౌ : వారి వలన మీకేమి భయము? వారు మిగుల శాంతస్వభావులు. ఎంతభయంకరులో యంత శాంతమూర్తులు.

సు : నీవు సింహబలుని యింటికి వెళ్ళిన దెందులకు?

ద్రౌ : తమరు వెళ్ళ మని యాజ్ఞ యిచ్చిరని వల్లకి చెప్పినది.

సు : నే నట్లనలేదు తల్లీ!

ద్రౌ : నేను వచ్చి మిమ్మడిగినప్పుడు మీరు 'ఊఁ' అన్నారు.

సు: నే నప్పుడు మద్యమువలన స్పృహలో లేను.

ఉ: ఇది వల్లకి వంచన.

సు: మద్యము త్రాగుటవలనఁ గలిగిన మహాపద.

దా: (స్వ) నిజముగా నీసన్నుగడ వల్లకిదే. మొదటఁ గొంచె మీమె ననుమానించితిని. సత్కులప్రసూత యీమె యి ట్లేలఁ జేయును.

సు: కీచకుని యింటికి వెళ్ళిన తరువాత నే మైనది?

దా: అమ్మా! ఏమని చెప్పుదును? ఆదుర్మార్గుడు నిన్నవోలె నన్ననరాని మాటలతో సంబోధించి నన్ను నీచముగాఁ బలుకరించినాఁడు. నేను నచ్చట నున్న నాకేమి యగునో యని బంగరుగిన్నె త్వరలో నక్కడనే విడచిపెట్టి వీధివెంబడిఁ బరుగెత్తితిని. అతఁడు నా వెంటబడి తఱుముకొని వచ్చినాఁడు. కొంతదూరము వచ్చి వెనుదిరిగిపోయినాఁడు.

సు: అయ్యో! ఎంతపని జరిగినది. తల్లీ! ఇది నా పొరపాటు. నన్ను క్షమింపుము.

దా: అమ్మా! ఎంతమాట యంటివి.

సు: వల్లకీ! నీ కీ యంతఃపురమునఁ దావు లేదు, పొమ్ము.

(వల్లకి నిష్క్రమించును)

సు: సైరంధ్రీ! దారిలో నీభర్త కనంబడె నంటివిగా

దా: అవును.

సు: ఇది యాయనతోఁ జెప్పితివా?

దా: ఆయనయే చూచినారు.

సు: ఏ మన్నారు?

దా: ఇంక నెవ్వఁడు దాను నన్ను వెన్నంటి యుండెద నన్నారు. నే నింకఁ బనిమీఁద వెళ్ళెదను. సెలవు. (నిష్క్ర)

సు: అమ్మా! ఉత్తర! నీ వింక నర్తనశాలకుఁ బొమ్ము

ఉ: తల్లీ! నా కా పేరు విన్న భయముగాఁ నున్నది. నేను నేటి కిక్కడ నే యుండెదను.

సు: ఏమి వింతలు కానున్నవో! మఱల మేఘములు మూసికొని వచ్చుచున్నవి.

(తెరలో)

దేవీ! నర్తనశాలవద్ద నేదో గృహము తగులఁబడి పోవుచున్నది.

ఉ: అమ్మా! గంధర్వులు!

(తెరపడును)

# షష్ఠాంకము

## ప్రవేశము — కీచకుఁడు

కామ మెంత గర్వాత్మైనది. పసిపిల్ల. ముక్కుపచ్చలారనిది. నేనెంత హీనుఁడ నైపోతినామె ముంగు. నే నెందుల కంత బేలవోయితిని? నేను రాజకూఁతుర నన్నది. రాజశబ్దము నన్నంత భయపెట్టవలయు నేమి? ఆ మాట యెవ్వరన్నను నే నంతియేనా? ఆపసిపిల్లలో నంత న్యాయ మున్నదా? ప్రపంచకములోనిదౌష్ట్య మేమియు నెఱుంగని యీపసికూనయే తనను ధర్మాధికారమునకు. ఆమె గాంక్షించి కేవలైన నప్పుడట్లన్నను నాకు భయ మయ్యెడిదికాదా. అస్పృష్టాఘమైన యీ మెదే యట్లనుటకుఁ దగును.

నిజముగా నే నెంత నీచుఁడ నైపోతిని. నావంటివాఁ డూరివెంట నొకకామినిని దఱుముకొని పోయిన ప్రతిష్ఠగానిని? ఇదివఱకే నా ప్రవర్తనవలన నూరంతయు నాయెడ ద్వేష భావము గలదిగా నున్నది. ఇందంకు నాచేసిన పుణ్యకార్యములును నీ మహాపాపరాశిలో మునిగిపోయినవి.

నేను సుక్షత్రియుఁడను కాను గనుకనే నాకీ నీచపుబుద్ధులనికూడ విరోధులు గుసగుసలాడుచున్నారు. ఒక్క బాహుబలముచేత వీని నన్నిటిని జయించు టెట్లు?

ఇంతలోనీప్రవర్తన మాని వేయుదునా? ఊరెల్ల గంధర్వులతో నిండినదని వదంతులు ప్రబలినవి. ఇందాఁక కామపాలుఁడు నాతో ననలేక గంధర్వులు నర్తనశాలయొద్దఁ గొన్ని యుండ్లు కాల్చిరని చెప్పినాడు. మే మయిదుగురము సమానబలవంతులము. నేను, భీముఁడు, దుర్యోధనుఁడు, బకుఁడు, హిడింబుఁడు మాలో మొదట నెవరిచేత నెవరోడిపోదురో, తక్కినవారుగూడ

వాసిచేతనే యోచిపోదురఁట. భీముఁడు బకహిడింబులను
జంపినాఁడు. దుర్యోధనుఁ డతని చేతఁ జచ్చువాఁడు కాఁడు. నన్ను
భీముఁడు గెలువనేలేఁడు. ఆయన నతఁ డెక్కడనుండి వచ్చును?
తక్కినవారి వలన నాకు మరణమే లేదు. మఱల నన్నీ యనుమాన
మేల బాధించుచున్నది? ఇది యెంతవఱకు నిజము! ఈయను
మానము గొద్దిగానే తేల్పనగును.

ఆలోచించిన నిది యనుమానమే. గంధర్వులకు వారికి
నేమి సంబంధము? అయినను నిగూఢ రాజ్యవ్యవహారములు
తెలిసికొనవలసిన యమాత్యునితో ని విషయమున మాట్లాడె
దను. ఎవరక్కడ?

సేవ: (ప్రవేశించి) చిత్తము.

కీచ: అశ్వపాలుని బిలువుము.

సేవ: అశ్వములు శాలలోనుండి త్రెంచుకొని యడవుల
వెంటఁ బడినవఁట. వానిని వెదకికొని వచ్చుటకు వెళ్ళినాఁడు.

కీచ: ఒక్కగుఱ్ఱము లేదా?

సేవ: అన్నియుఁ బాఱిపోయినవి.

కీచ: ఏమిటీ వింత?

సేవ: స్వామీ! గంధర్వులు పురమునఁ బ్రవేశించి
యిట్టి దుష్కార్యములను జేయుచున్నారు.

కీచ: ఎవరోయీ యా గంధర్వులు. ఎవరికైనఁ
గనంబడిరా?

సేవ: వాఁడు చూచె నని వీఁడును, వీఁడు చూచె నని
వాఁడును జెప్పుటయే కాని యింతవఱకును నేను జూచితి నని
చెప్పువా రెవ్వరును లేరు.

(తెరలో)

మహారాజుగారేమి చేయుచున్నారు?

కీచ : ఎవరు వారు?

సేవ : శారద్వతుఁడుగారు.

కీచ : నీవు పొమ్ము.

(సేవకుడు నిష్క్రమించును. శారద్వతుఁడు ప్రవేశించును.)

కీచ : మిత్రమా! రమ్ము.

శార : దీర్ఘాయురస్తు

కీచ : కుఱ్ఱవాఁడవు, నాకు దీవన యొసఁగుటకు?

శార : నేను బ్రాహ్మణుఁడఁగదా!

కీచ : ఇది యేమి దీవన?

శార : మఱి యే మనవలె?

కీచ : కామినీపరిష్వంగ ప్రాప్తిరస్తు అనవలె.

శార : అన్నింటికిని బ్రధానమైనది యాయుర్దాయము

కీచ : ఏమి యాయువు లేకపోయిన? బ్రతికియున్న నాలుఁగుదినములును సుఖముగా నుండవలె.

శార : మిత్రమా! నే నొక్కమాటఁ జెప్పెదను. నీకుఁ గోపము రాదుగద.

కీచ : నా కేమి కోపము?

శార : నిన్ను గుఱించి యూరు మిక్కిలిగాఁ జెప్పుకొనుచున్నది.

కీచ : అవునోయీ! ఏమి చేయుదును! నా యీ ప్రవర్తన నాకే బాగుగ నుండలేదు. కాని యా సుందరి

నష్టమధుమల్లికా ప్రసూన రమణీయ
మూర్తి, నీహారపింసుకస్నేహహాసాతి
శీతలమనోహరాపాంగ, భిన్నరత్న
శకలదంతపంక్తి! మృగేంద్రశాబమధ్య!

శార : (స్వ) ఈయన తన్మయత్వముం జూచిన నాకు భయ మగుచున్నది.

కీచ : మిత్రమా! ఇప్పుడు మాయక్క సుదేష్ణాదేవి యంతఃపురమునకుం బోవలయును.

శార : ఎందుకు?

కీచ: ఎందుకా? నామనోహరిణియక్కడనేయున్నదికదా!

శార : మిత్రమా! నా దోకహితము.

కీచ : ఏమది?

శార : పరాంగనారతి పాపహేతువు. పాపము నాశ హేతువు.

కీచ : (మౌనము.)

శార : అన్నియుం దెలిసినవాఁడవు. నీకుం జెప్పవలసిన ది లేదు.

కీచ : తమ్ముఁడా! నిజమే. కాని నే నామెను జూడ కుండనయిన నుండలేకున్నాను.

శార : దానివలన లాభ మేమి?

కీచ : ఈచిత్తసంక్షోభము కొంచెము శాంతించఁగలదు.

శార : మఱి యక్కడకుం బోవలెనన్న గుఱ్ఱములు లేవాయెను. రథము లేదాయెను.

కీచ : నడచి పోవుదము.

శార : ఇంతదూరము నడచియా?

కీచ: ఏమి సుకుమారుఁడవు?

శార: నేఁ జెప్పినది నా విషయము గాదు.

కీచ: నాకేమంత భయము లేదు. వర్షము రానగడ దారిలో!

శార: ఏమో!

కీచ: రాదు. ఆకాశము చూడుము, నిర్మలముగా నున్నది.

శార: అక్కడకు వెళ్ళి యేమి చేసెదవు?

కీచ: చేయుట కేమున్నది? ఇంక నన్నామె యెట్టులను దయతోఁ జూడదు. ఆమెతో మఱల మాటాడవలయునని యే లేదు. కాని

ఆ లలితాంగి పాదముల యందునఁ జూపు నిగుడ్చెదన్ దదీ
యాలస యానవైఖరుల కంజలి పట్టెద నామె నిల్చు నా
నేలను ముట్టి నా హృదయనీరజమందున నద్దికొందు నా
లోలదృగంత క్రోధపు విలోకనముం గని నిక్కి పోయెదన్

ఆమె పూవులుకోసిన తీవను కౌఁగిలించుకొందును. ఆమె —

శార: చాలు చాలు

కీచ: ఏమంత వైమనస్యము.

శార: ఈ మహాభక్తికి నే దేవుఁడైన నీకుఁ గైవల్యమిచ్చెడువాఁడే.

కీచ: ఏదైన నానందమే కదా! నేను రమణీయమూర్తిని ధ్యానించి తన్మయత్వముఁ బొందెదను. ఆనందమే కైవల్యమైన యెడల నాకది తటస్థింపదా?

శార: ఇది కుతర్కము.

కీచ: మనము బయలు దేరుదము, రమ్ము.

(నిష్క్రమింతురు) (తెరపడును)

# సప్తమాంకము

(ప్రవేశము సుదేష్ణ - ఉత్తర శయ్యపై)

సు : అమ్మా! ప్రొద్దుటినుండి భోజనము లేదు. ఏల యిట్లున్నావు. లెమ్మ, కొంచె మెంగిలిపడెదవుగాక.

ఉ : అమ్మా! నా కాకలిగా లేదు.

సు : ఏలనే తల్లీ!

ఉ : ఆ వలలునిం జూచిన నాకు భయముగా నున్నది.

సు : అతనిని జూచిన భయ మెందుకు?

ఉ : అతని కన్నులు నేం జేలోకో భయావహములుగా నున్నవి.

సు : అతం డెంతమంచివాండు; చాలశాంతస్వభావుండు! అడకువ కలవాండు.

ఉ : నా కతనిగూర్చి యనుమానముగా నున్నది.

సు : ఎందుకు ?

ఉ : అమ్మా! అతండు గంధర్వుండే.

సు : ఛీ, ఛీ, వెట్టివాండు గంధర్వుం డేమిటి?

ఉ : అమ్మా! నీవట్లనెదవుగాక, మన నగరెల్ల గంధర్వులు తిరుగుచున్నారు. మాఱు వేషములతోం దిరుగుచున్నారు.

సు : నీ కింతభయ మేమిటికి?

ఉ : రాజసభలలో గంధర్వులుతిరుగుచున్నారంట. పశువులమందలన్నియు గంధర్వుల యాక్రమణచేతం జెల్లాచెదరైనవంట. అశ్వశాలలలోని గుఱ్ఱములు త్రెంచుకొని పాఱిపోయినవంట. నర్తనశాల సరియేకదా! ఆ చుట్టుపట్టుల జనమే సంచరించుటలేదు. ఊరంతయు గగ్గోలుగా నున్నది. చివరకు గంధ

ర్వులు మనవంటసాలలోఁగూడఁ బ్రవేశించినారు. నామనస్సు మనస్సులో లేదు.

సు: అయ్యో! పిచ్చితల్లీ! ఇంత పేదగుండెదానవు గనుకనే నిన్నొకయ్యకయ్యవలెనన్న నాగుండె చలించుచున్నది. పాలు తెమ్మని కబురంపితిని. ఈరాత్రి కవి త్రాగి పండుకొనుము.

ద్రౌ: (ప్రవేశించి) (స్వ) నర్తనశాలలో గంధర్వులున్నారని వదంతి పడినది. ఇదేమి చిత్రము? బిడ్డ యుత్తర నేఁడేమో ఖిన్నయైయున్నది. ఆమెమనస్సేలనో కల్లోలపడినది. ప్రొద్దున నాదురాత్ముఁడు నన్నుఁదఱుముకొని వచ్చుటఁజూచినది మొదలామెమనస్సు సరిగా లేదు. అంత పాపభీరువు. ఈతల్లి యెవరియిల్లు పవిత్రము చేయునో! ఆమెను జూచినప్పుడు నా మనస్సేలొకో ద్రవించుచున్నది. ఆయమ నవ్వినప్పుడు మాశశిరేఖనవ్వినట్లుండును. ఎన్నాళ్ళయినది మాపిల్లలనుజూచి? ఏమి జూదము? జూదమనిన వెంటనే నాకు దుశ్శాసనదుర్మార్గత్వము జ్ఞాపకము వచ్చుచున్నది. ఈ జన్మలో నా పరాభవము చల్లారుట లేదు కాబోలు. లేకేమి! అజ్ఞాతవాసము పూర్తి కావచ్చుచున్నది.

ఇప్పుడీక్రొత్తబెడఁద తప్పుకొనుటెట్లు? ఈదౌర్భాగ్యునకింతలో నింతఘోరమృత్యువు వ్రాసినాఁడేమొ విధాత? (చూచి) ఆ వచ్చునది యెవ్వరు? తంత్రిపాలుఁడా! హా! సహదేవా! నీకెట్టి స్థితి వచ్చినది. ఈ రాజకుమారులు సర్వసర్వంసహా చక్రమున కధినాథులా!

అదేమి! ఇతనిముఖము క్రోధముచేత నెఱ్ఱవాఱినది. పాలితఁడు తీసికొని రావలసిన యవసరమేమున్నది? ఏదో

యాలోచనావిముగ్ధునివలె వచ్చుచున్నాఁడు. సంవత్సరము పశువులు గాచుటచేత నీయనలో గొంచెము మార్పు కలిగినది. చూచుటకు దూరమునుండి పశువులకాపరివలెనే యున్నాఁడు.

సు: అమ్మా! సైరంధ్రి! ఉత్తర పొద్దుటినుండి భోజనము చేయలేదు. నీవు భోజనము చేయలేదని కూర్చున్నది. నీవు తొందరగా లేచి స్నానము చేయుము. పిల్ల భోజనము చేయదఁట. పాలు త్రాగెదనన్నది. పాలు మందనుండి ప్రత్యేకముగాఁ దీసికొనిరమ్మని చెప్పి పంపితిని. అవి వచ్చును. నీవు వానిని దీసికొని స్నానము చేయుము. నేను పాపపరిహారార్థమును, అమంగళనాశముకొఱకును శ్రీ చంద్రమౌళీశ్వరుని బూజచేయుటకుఁ బోవుచున్నాను.

తంత్రీపాలుఁడు: (ప్రవేశించి) అమ్మా! ఇవిగో పాలు.

సు: నీ పేరేమి?

తంత్రీ: తంత్రీపాలుఁడు.

ఉ: ఓయీ! బోయఁడా! మాయావుల నెద్దులను గంధర్వు లాక్రమించుకొని రఁటగదా!

తంత్రీ: గంధర్వులాక్రమించుకొని యందంచుఁ దఱిమి వేసిరి. కాని మేమడవులవెంట వెదకి కొన్నింటిని బట్టుకొంటిమి. మంద లెచ్చపెచ్చటికిఁ బోయినవో తెలియవచ్చినది. తెల్ల వారువఱకు సంతయు సరిగా నుండును.

ఉ: నీవు గంధర్వులను జూచినావా?

తంత్రీ: చూచినాను.

ఉ: వా రెట్లున్నారు?

తంత్రీ : రాజులవలె నున్నారు. మంచి యందగాండ్రు, అక్క ఉన్నవి. వారు దారివెంటఁ బోవుచు సంగీతము పాడు చుందురు. తంబురాలు మీటుచుందురు.

ఉ : వారు మహాభయంకరు లఁటగదా!

తంత్రీ : చూడఁ జక్కనివారు. వారితో మాటమాట వచ్చిన కష్టము. కోడెత్రాచులకన్న విషధరులు.

ఉ. అమ్మో!

తంత్రీ : వారూరకే యెవరిజోలికిని రారు. వారిజోలికిఁ బోయిన బ్రతుకనీయరు.

ఉ : మఱి మామామ కీచకుఁడు వారిజోలికిఁ బోయెనుగా!

తంత్రీ : ఎందుకుఁ బోయినాఁడు?

ద్రౌ : నా మూలమున.

తంత్రీ : నీ వెవరవు ?

ద్రౌ : వారిభార్యను.

తంత్రీ : నీ విం దెందు కుంటివి?

ద్రౌ : దాసిగా నుంటిని.

ఉ : ఈమెను మామామ ప్రొద్దున వెంట బడి తఱిమి నాఁడు. గంధర్వులకుఁ గోపము వచ్చిన దఁట.

తంత్రీ : ఊహూ.

ఉ : మీ మందలన్నియు దొరకెనా?

తంత్రీ : ఇంకఁ గొన్నింటిని వెదుకవలయును.

ఉ : నీవు నర్తనశాల మీదుగాఁ బోయెదవు సుమా, అక్కడ గంధర్వు లున్నా రఁట.

తంత్రీ : పోను పోను,

ఉ: గంధర్వులను గురించి యూరిలో నేమని చెప్పుఁ
కొనుచున్నారో నీ కేమైనఁ దెలియునా?

తంత్రి: నేటిరాత్రి రెండుజాములకు నర్తనశాలలోఁ బెద్ద
యుద్ధము ట.

ఉ: ఎవ రెవరికి ?

తంత్రీ: గంధర్వులకు వారి విరోధులకు.

ఉ: అయ్యో! ఎట్లు!

సు: అమ్మా! జనములు చిలవలకుఁ బలవలు గల్పించి
చెప్పుకొనెదరు.

తంత్రీ: అమ్మా! సెలవు: (స్వ) యుధిష్ఠిర చక్రవర్తి
యాజ్ఞనిర్వర్తించినట్లు నగునది. నా ప్రియురాలిని జూచినట్లయినది.

(నిష్క్రమించును)

ద్రౌ: (స్వ) నా భర్త లెంతయుద్దేశించినారు? నేనిప్పుడు
కీచకునకుఁ గబురెట్లు పంపుకొనుదు? ఇప్పుడు వల్లకి యుండిన
బాగుగ నుండును.

సు: ప్రొద్దు గ్రుంకవచ్చినది. సైరంధ్రీ! నీవు స్నానము
చేయుము. ఉత్తరా! మనము పోవుదము రమ్మా!

(ఉత్తర-సుదేష్ణ నిష్క్రమింతురు)

ద్రౌ: నా మనోహరుని సౌందర్యము మరల నేటికిఁగను
లారఁ జూచితిని. రోజును భీమసేనుని నప్పుడప్పుడు యుధిష్ఠిరార్జు
నులను జూచుచుంటిని గాని యీ సంవత్సరమునుండి నకులసహ
దేవులను జూడలేదు. అతఁడు నా వంక నోరచూపు చూడఁబోయి
పరాభవఖిన్నమైన వదనము తెచ్చుకొని సుదేష్ణోత్తరలు
చూచెద రేమొ యని పౌఢమైన తనచూపు బిగించుకొని
పోయినాఁడు.

యుధిష్ఠిరుని బుద్ధి యప్రతిమానముగ నున్నది. ఎంత తొందరలో కార్యము పూర్తి చేయవలెను. ఇప్పుడు కీచకుని నేను బంపించవలెనా నర్తనశాలకు? ఇప్పుడు నా కతడెచ్చట కనబడును.

నర్తనశాలలో నేటి రాత్రి యెవ్వరుండరు? భీము సేనుని పంపించుటకు సార్వభౌముడు యత్నము చేసియుండవలె. ఈ గూఢచర్య యెట్లు నెగునో! గంధర్వులను ప్రతీతి బాగుగా వ్యాపించినది. ఈ ప్రతీతిలో పాండవాజ్ఞాతవాసము బాగుగా నిర్వర్తింపబడు చున్నది.

(కీచకుడు ప్రవేశము)

ద్రౌ : ఓహో! వెదుకబోయిన తీగె కాలికి దగిలినది. ఇతనిని, పాపము! విధి తెచ్చుకొని వచ్చినది. ఇతని మొగము ఖిన్నమై పోయినది.

కీచ : (స్వ) ఆమె యిచటనే యున్నది. ఇంక నామెతో ప్రసంగించి యేమి లాభము? ఇంచ యుండి యామె వంక నించుక చూచియైన సంతోషించెదను.

ద్రౌ : ఏమో! నెమ్మదిగ నున్నాడు. అయిన నిప్పుడు మొగము ప్రసన్నముగా నుంచుకొనవలెను.

కీచ : (స్వ) ఈమెను నా సందేహ మడిగెదను. కాదల్లే సంబోధించెదను. (ప్ర) పాంచాలీ!

ద్రౌ : (స్వ) వీడు మహామేధావివలె నున్నాడు. యుధిష్ఠిరచక్రవర్తి యిందుకనియే యింత తొందరపడినాడు.

(నవ్వుకొనును.)

కీచ: ఈమె ద్రౌపదియైన నా సంబోధనమున కెంత పరితాపము పొందవలెను. కాదు, నాయెడ నీమె ప్రసన్నయై నట్లున్నది.

ద్రౌ: (స్వ) ఇతనిని త్వరలో నీటనుంచి పంపివేయ వలయును.

కీచ: ఏమి, నీ మొగమునందు విషాదమేఘములు విచ్చి పోయినవి.

ద్రౌ: నిర్ఘాకాలము పోయినది.

కీచ: ఇదివఱకు నాయందు నీ కేల వైమనస్యము?

ద్రౌ: (లజ్జాభినయము)

కీచ: నాకీ మహాప్రసాదము.

ద్రౌ: అతిరహస్యముగ నుండవలయును. ప్రాణమిత్రులకుఁగూడఁ దెలియరాదు.

కీచ: ప్రమాణము చేసెదను.

ద్రౌ: వలదు! నేటిరేయి రెండుజాములకు నర్తనశాలలో

కీచ: అనుగ్రహింపఁబడితిని.

ద్రౌ: అచ్చట నెందఱుందురో తెలియునా? గంధర్వులచ్చట నున్నారని వదంతి ప్రబలి జను లచ్చటికిఁ బోవుట లేదు. కనుక నది మిక్కిలి రహస్యప్రదేశము.

కీచ: ఇంక సెలవు.

ద్రౌ: నల్లని బట్టలు కట్టుకొని రావలయును.

కీచ: ఎందుకు?

ద్రౌ: చీఁకటిలోఁ గలసిపోవుటకు!

కీచ: ఇంక నేను వెళ్ళెదను.

ద్రౌ : అవును! ఎవరైనను జూచెదరు.

కీచ : మాట తప్పవుగదా?

ద్రౌ : ప్రాణము పోయినను (కీచకుఁడు నిష్క్ర).

ద్రౌ : ఇతఁడనుమానించినాఁడు. మేధావియే! పాపము దుష్టగుణమువచ్చి క్రమ్ముకొనిపోవుచున్నది. ఇతని కెట్లు తెలిసినది? నేనువచ్చి సంవత్సరమైనదని నా పతులైదుగురని, యీ సంవత్సరమైన వెంటనే మఱల నేను శత్రువుల గెలుచుటకుఁ బోయెదనని; యిట్టి యానవాళ్ళను సరిపోల్చుకొనఁ దగును నేమో యని యాలోచించినాఁడు. ఆమాట యని నా మొగము వంక సదాసించి చూచినాఁడు. యుధిష్ఠిరచక్రవర్తి ధర్మప్రభావమున నా కష్టముల మనస్సు నిశ్చలముగా నున్నది గనుక సరిపోయినది. ఈ రహస్యము బయటకుఁ బ్రాకకుండ నితని దొందరలో భూమికి దూరము చేయవలసినదే!

భీమసేనున కీవర్తమాన మిదివఱకే తెలిసియుండును. అయినను నేనుబోయి యాతని కీవిషయము తెలియబఱచి యుత్సాహము పుట్టించెద. ఏమైన రెండుమూఁడాయుధములు పట్టుకొని వెళ్ళుటయే మంచిది. గంధర్వులని ప్రతీతి పుట్టినది గాన, నా దుర్మార్గుఁ డెటుపోయి యెటువచ్చునో యని యేమైన నాయుధములఁ దెచ్చునేమో? బకజరాసంధాది దుష్ట నిశాచరులఁ ద్రుంచిన జగజెట్టి కితఁడు లెక్కయా? అయినను, నితఁడు బలవంతుఁడని మే ప్రతీతి! కానిమ్ము! జారత్వసురాపానములవలనఁ గలిగిన దోష మాతని యాయువు నిదివఱకే క్షీణింపఁజేసినది. మహానుభావుఁడగు వృకోదరుని యాయువు వతని ధర్మచింతనవలన వృద్ధియగుచున్నది.

అప్పుడే చీఁకటులు క్రమ్ముచున్నవి.

ఉ : (ప్రవేశించి) మాలినీ! భోజనమునకుఁబోయెదవా?

ద్రౌ : బిడ్డా! నీవుకూడ వచ్చినఁ బోయెదను.

ఉ : నాతో నీకు వంతా!

ద్రౌ : మహారాజకుమారివి నీవు! దాసిని నేను.

ఉ : అది కాదమ్మా! క్షమింపుము.

ద్రౌ : క్షమించుట నేనా? నీయందు నాకుఁగల ప్రేమ చేత నట్లంటిని.

ఉ : నాయందు నీకెందు కంతప్రేమ?

ద్రౌ : సేవకులకుఁ దమ యజమానుల యం దెంతకో మఱి ప్రేమ.

ఉ : అదికాదు. నిజము చెప్పుము.

ద్రౌ : నా కోడలివలె సుందరివు నీవు.

ఉ : నీకుఁ గోడుకున్నాఁడా!

ద్రౌ : నేను స్నానముచేసి వచ్చెదను. నీ విందుండుము. కలసి భోజనమునకుఁ బోదము. (నిష్క్రమించును)

(ప్రవేశము - వలలుఁడు)

వల : బిడ్డా! భోజనమునకు రాలేదేమి ప్రొద్దుటినుంచి?

ఉ : (మాటాడదు)

వల : ఏమమ్మా! నాతో మాటాడవు! నన్నుఁ జూచిన నీకు భయ మెందుకు? నే నేమి రాక్షసుఁడవా?

ఉ : కాదు, గంధర్వుఁడవు!

వల : గంధర్వుఁడు మీ బృహన్నలాచార్యులవారు

మాకేమి నాట్యము వచ్చునా? సంగీతము వచ్చునా? పాక శాస్త్రమున మేము గట్టివారము.

ఉ: నాకు భయము వేయుచున్నది.

వల: భయమా? బలహీనత్వముచేత. వైద్యము చేసియు నిస్సారమునలనను లోపల నరములకు బలువులేక యట్లగును. ఈనాడు మంచివంటకములు చేసితిని. అవితింటివా! రేపు ప్రొద్దుటికిఁ జక్కఁగా సుఖముగా నుందువు.

ఉ: వలలా! నీవు పండితుఁడవే! వైద్యముగూడ దెలియునా యేమి?

వల: పాకమునకుఁ గావలసినంత!

ఉ: (స్వ) ఇతని మాటలనలన నాకుధైర్యమువచ్చినది. (ప్రకాశముగా) నేను స్నానమాడి వచ్చెదను. అదిగో మాలిని వచ్చుచున్నది. (నిష్క్ర)

(ప్రవేశము ద్రౌపది)

వల: (స్వ) సర్వసర్వంసహాధినేత యగు యుధిష్ఠిర సార్వభౌముని కర్ధాంగి యైన యీమె జానకీదేవివోలె నెన్ని యిక్కట్టులు పడుచున్నది. రామచంద్రునకు హనుమంతుని వలె నీ మహారాజునకు నేను దొరకినాను. ఇద్దర మున్న దమ్ములమే! పాపము! నన్నుఁజూచి యెంతఖిన్న యగుచున్నది! (ప్రకాశము) ఏమమ్మా మాలినీ! ప్రొద్దుటినుండియు భోజనము నకు రాలేదు పాపము!

ద్రౌ: (స్వ) నాధుఁడు నన్నూరడించు చున్నాఁడు. (ప్రకాశము) రుచిగల నీవంటకమ్ములు నాకీ పూట తృప్తిఁ గలిగించఁగలవు.

వి : (స్వ) మాయన్నగారి యాజ్ఞ నేమో యనుసరింపు మనుచున్నది.

(ఉత్తర ప్రవేశించి)

పరపురుషులతో మాట్లాడని సైరంధ్రి యితనితోను, మఱికొందఱితోను మాటలాడును. పుణ్యపురుషులైనవారితోఁ బ్రసంగించవచ్చును గాబోలు!

వల : అదిగో! ఆయుష్మంతురాలా! రమ్ము! సైరంధ్రీ! బిడ్డకు బంగరు టరటియాకు వేయుము.

(తెరపడును)

# అష్టమాంకము

(కీచకుఁడు ప్రవేశము)

నర్తనశాలవద్దనన్నుఁ దుదముట్టించుటకుఁ బ్రయత్నమా యిది? గంధర్వులు నన్ను సంహరించుటకు వచ్చెదరా? అయినను నన్నుఁ దుదముట్టించఁగల మహాబలశాలి యెవ్వఁడు?

నిన్న సాయంత్రమున నామెను జూచితిని. నేటి ప్రొద్దుటివఱ కామె కా ప్రయత్నములే తెలియవు. ఈపనులెల్ల రాజాంతఃపురము కదలుటకు వీలులేదు. ఎవ్వరితోఁ జెప్పెను? చెప్పి యింతయూహ యెట్లు పన్నఁగలదు?

అయినను నాయెడల నామె కింతలో నంత ప్రసన్నత యెట్లు వచ్చినది? నిన్న సాయంతనము లేని యేకాంత మీ సాయంతనమున నెక్కడ నుండి వచ్చినది? అట్లుకాదు. నిన్న నన్నుఁ జూచుటయే క్రొత్తయాయెను. నేఁడు నన్ను గుఱించి విచారించి యుండును. ఆలోచించి యుండును!

ఇన్ని సందేహము లెందుకు? ఆమెకు నాయెడలఁ బ్రేమ లేకున్న నట్లేల మాట్లాడును? ఆచూపులు చూచునా? అస లట్టి మహాసౌందర్యవతికి దురూహ లేల కలుగును? ఆమెలో నిట్టి విపాలోచనములు కలుగునా?... కలిగినచో!

మధుమాసమల్లికామంజరీగర్భముల్ విషవాహినుల స్రవించునేమొ?
బాలమధురసాలపాదపాగ్రంబులు ముషిణిపండులు పండి మ్రగ్గునేమొ!
చారుశారదయామినీరమ్యచంద్రికల్ ఘనచితాగ్నిచ్ఛటల్ గ్రమ్మునేమొ!
నవవసంతపికాంగనాగానములయందుఁ బ్రళయగర్జనములు ప్రబలునేమొ!

చివురురాగమ్ము లంచునఁ జిలుకునేమొ
యంధకారప్రతిచ్ఛాయ లలముకొనుచుఁ
బూలపానుపు పైనిద్రపోవువేళ
వచ్చి కఱచునో గోదుమవన్నెత్రాచు!

దాసి : (తొందరగాఁ బ్రవేశించును)

కీచ : ఏమే! కాలమునకెఁ దలుచుకొనివచ్చితివి?

దాసి : రెండుజాముల లోపుననే తాము వెళ్ళవలెనంటిరిగా.

కీచ : ఇప్పు డెంత ప్రొద్దుపోయినది!

దాసి : రెండుజాములు కావచ్చినది.

కీచ : మఱి నేను తొందరగా వెళ్ళెదను.

దాసి : అలంకృతులు గాకుండ నేనా?

కీచ : అట్లయిన నింతయాలస్యము చేసితివేమి?

దాసి : ఆలస్యమైనది.

కీచ : నే నిప్పుడే పోవలెను.

దా : నే నీనాఁడు మనస్ఫూర్తిగాఁ జేతులార మిమ్ము నలంకరింప వచ్చితిని.

కీచ : రేపు చేయఁగూడదా?

దా : ఇక నా కా యోగ్యత యెక్కడిది?

కీచ : ఎందుచేత?

దా : ఇదియే నా కడసారిచూపు!

కీచ : అపశకునము మాటలాడెద వేల?

దా : రేపుప్రొద్దుననే నత్తవారింటికిఁదీసికొనిపోబడుదును.

కీచ : ఏమంత తొందర!

దా : నాభర్తకు నన్నిచ్చట నుంచుట కిష్టము లేదఁట!

కీచ : (స్వ) వీరి [illegible] రాజపురుషులకు భోగ్యము లగుచున్నవి. అందులోఁ బెండ్లి చేసికొన్న తరువాత నేజాతివారైన నేమి? భర్త ననుసరించియుండవలసినదే! (ప్ర)

నా కష్టకాలమున సేవ చేయనందుకు గాని యిన్నాళ్ళుగా మాసేవఁ జేసినందులకు నీకీ రత్నహారము బహుమాన మిచ్చితిమి, తీసికొమ్ము.

దా: స్వామీ! మిమ్ముల నలంకరించవలె నని యున్నది.

కీచ: మగనాలివి మమ్మునేల తాఁకవలెను! నీచావృత్తి నీచము. ఇదివరకు మాపొనర్చిన యఘములే చాలును మమ్ముఁ ద్రుంచి వేయుటకు. ఇది తీసికొని పొమ్ము! (అని హారమిచ్చును.)

(దాసి తీసికొని నిష్క్రమించును.)

ధనములఁ జేసి హెచ్చును మదం బది కారణమై యఘంబు హె
చ్చు నని వచించు పండితుల సూక్తులు రిత్తయె నానె! పేరి యె
ట్టినెపమునందు వచ్చునో! ఘటించును మృత్యువు నారకాగ్ని ద్రే
ల్చును ప్రళయాంతమున్ నరకలోకమె శాశ్వతమే మె జీవికిన్.

ఈ యవినీతిప్రవర్తన నన్నెంతగా వేధించుచున్నది? ఛీ! ఛీ! నే నచ్చటికిఁ బోను! తెలిసి తెలిసి మహాఘము నేల చేయవలెను?

మఱి యామెతోఁ దప్పకుండ వచ్చెదనని చెప్పితిని గదా! పోకున్న నామె నాకై యెదురుచూచి యింతమోసగాఁడా యనుకొనునేమొ! అవును! తప్పకుండఁ బోయెదను. పోయి యామెకు నాపశ్చాత్తాపముఁ దెలిపి యీమహాఘమునుండి నన్ను నేన సంరక్షించుకొనెదను? తీరా, అంతవరకుఁ బోయిన తరువాత కామమే గెలుచునేమో? పోకుండుటయే మంచిది!

నన్ను విరాగ మొకవంకను గాని వాంఛ యొకవంకను బీల్చి పిప్పిచేయుచున్నవి, పోదునా? వలదా? పోయెదను! దారిలో నేదైన నామీఁదఁ బిడుగుపడి నేను జచ్చిపోయిన బాగుగ నుండును.

ఇంతితృష్ణ పనికిరాదు. ఈతృష్ణ యేమొ నన్ను దహించుకొని పోవుచున్నది. ఈతృష్ణను జయించిన మహానుభావులగు ఋషులకుం బ్రణామములు.

ఈ మహానిశాసమయమున నా ప్రయాణ మెక్కడకని పోవుచుంటిని.

ఇది మహోపద్రవ ఋతువు పైని నిశాస
మయము భీకరమయ్యె నా మనసు మాత్ర
మీ భయంకరరూపమ్ము జేపరించు
నే యగాధమ్ములోం దిగునో యిదేమి?

నాకు దుఃపథంగని నిశాంబలిననేత్ర
కనులవెంట బాష్పమ్ములు కార్చుదొడంగె
నాకును భయమ్ము కలిగెను నామనస్సు
మాత్ర మేటికో చీకట్లు మలచుకొనెదు.

గాఢతిమిరంపు గుప్పటి కప్పుకొనియెం
జలికి వెరచిన దనంగ నిశాలతాంగి!
ఆ మసంగులోకి నన్ను రమ్మనుచు నున్న
దటకుం బోవలె నని నాకు నాశ మెంతు.

ఈ తమస్సుల కెన్నేది మొల్లలోక
మాక్రమించెను వర్షంబు లంతకంత
కధిక మై యుప్పెనంబోలె నలముకొనియెం
బ్రక్షితమార్గంబులను ఒరీవాహసమితి.

కసగి యుజీమిన జీవలోకంబు లెల్ల
బధిరితం బౌనో పిడుగులు పశి జగంబు
సమసిపోవునో యిట్టి వర్షంబు కతనం
బ్రళయజలరాశి లోకంబు పైని బడునో?

(నిష్క్రమించును)

# న వ మాం క ము

(ప్రవేశము – వలలుడు, సైరంధ్రి)

వల : నీ వెట్లు వచ్చితివి?

సై : సుదేష్ణ నిద్దుర పోవుచున్నది.

వల : ఇంక నెవ్వరును లేరా!

సై : ఉత్తర యున్నది.

వల : ఇద్దఱిలో నెవ్వరైన మేల్కొని నీకోసము వెదకెదరేమో!

సై : ఉత్తర కొంకుచేతనో ప్రొద్దుటినుండియు భయముగానే యున్నది. నర్తనశాల పేరు చెప్పిన నామె బెదరిపోవుచున్నది.

వల : ఉత్తర యెటువంటిది?

సై : అతిసుకుమారి. స్నిగ్ధహృదయ.

వల : ఆమె యెడల నామనస్సేలనో మృదువగుచున్నది.

సై : ఆమె మానసికస్థితి చిత్రముగా నున్నది.

వల : వారు మేల్కొని నిన్ను వెదకినచో!

సై : నాకై యంతగా వారు వెదకరు. ఇంకను రెండు జాములు కాలేదా?

వల : ఇంత వానలో నీ వెట్లు వచ్చితివి?

సై : పైటకొంగు నెత్తిమీద వైచుకొని.

వల : (కొంగు స్పృశించి) తడిముద్ద యైనది.

సై : తడిసినదా?

వల : అవును.

సై : దేనితో?

వ : వర్షపు చీటికో.

సై : వర్షపునీరని యెట్లు తెలియును?

వల : మరి దేనికో?

సై : దుష్టుఁడగు కీచకుని నెత్తురుతో!

వల : వాఁడు చచ్చినాఁడు. (తెరపడును)

[ఇది విష్కంభము]

ప్రవేశము - కీచకుఁడు

కడు మనోనిశ్చయముచేతఁ గదుముఁబడియు
మాటిమాటికి నీవాంఛ మనసు నెల్ల
నావరించెను కన్నుల కంటఁగట్టి
నట్లు కనవచ్చు నీ యిరులందుఁ దెలివ

కురిసిన వర్షము కురిసినట్లేయున్నది. నా యెడల నీ ప్రకృతికూడ నింత వైమనస్యము వహించిన దేమి?

ఈ జలదుఁ డెంతకఠినుఁడో? యిరులు గ్రమ్మి
యస్మదాదుల మార్గంబు నడ్డగించి
కరుణ యించుక చూపించు కన్నె మెఱుపు!
అంగనల హృదయంబు లెట్లైన మృదువు

పురుషుని హృదయము స్త్రీకై యింత బడలుపడ నేల? బ్రహ్మపదార్థము ప్రకృతిలోఁ బ్రతిఫలించుట దానికి సహజము. అందుకనియే పురుషుఁడు తన ప్రేమ రమణీ మూర్తిలోఁ బ్రతిఫలించఁగాఁ జూడవలయు నని యారాటపడుచుండును.

(వలలుఁడు ప్రవేశము)

కీచ : ఎవరు నీవు, నామార్గ మనురోధించుచున్నావు?

వల : నీ వెవ్వరవు?

కీచ : నే నొక ప్రాణిని.

వల : కాదు ప్రాణమవు.

కీచ : నీ వెవ్వరవు?

వల : నేనా ! గంధర్వుఁడను.

కీచ : ఆ! (నివ్వెఱపోవును)

(వలలుఁడు నిష్క్రమించును)

కీచ : ఎవరీతఁడీ మహాంధకారములో నంతరించి పోయి నాఁడు (నడచి) ఇదిగో నర్తనశాల. ఆమె వచ్చినట్లు లేదు. (లోపలనందెరవళి) కాదు. వచ్చి నాకై యెదురు చూచుచున్నది. ఈమె పతులైన గంధర్వులను వెంటఁబెట్టుకొనిరాలే వచ్చినది. నేను నిరాయుధుఁడను. పౌరుషశాలు రయినవారు నాతో మల్లయుద్ధము చేసెదరుగాక !

అంతవఱకేల వచ్చును? ఆమెకు నాపైఁ బ్రేమ కలిగియే రమ్మన్నది. అసందర్భమైన యూహాలు తోఁచుచున్నవి. అయినను బిలచెదను. ప్రియా !

(తెరలో)

లోపలకు రమ్ము.

కీచ : లోపల గంధర్వు లున్నారా ?

(తెరలో)

మనసు చెదరినదా ?

కీచ : ఏమిది? నేను దారిలో నెవతిని జూడలేదా?

వల : (ప్రవేశించి) నీవు నన్నుఁజీకటిలో గుర్తించలేవు.

కీచ : నెమ్మదిగా మాట్లాడెద వేమి ?

వల : మనమాట లెవరికైన వినఁబడునేమో !

కీచ : వినఁబడదు. గాలి హోరు మని వీచుచున్నది. వర్షము కురియుచున్నది.

వల : పిడుగులు పడుచున్నవా?

కీచ : లేదు! ప్రియా! నీమీఁద నాకెంతటి ప్రేమయున్న దని నీ యుద్దేశ్యము?

వల : నే నన్న ప్రాణములుగూడ విడుచుచున్నాను. ఎంత యని చెప్పను?

కీచ : నీ గొంతుక మాఱిన దేమి?

వల : ప్రొద్దున నీవు నన్నుఁ దఱిమినపు డఱచుటచేత బొంగురుపోయినది.

కీచ : ప్రియా! నన్ను క్షమింపుము?

వల : నిన్నా క్షమించునది?

కీచ : అవును! క్షమించవలదు.

సీ. వేణీభరమున బంధించి నన్నుఁ
గుచమహాపర్వతములపైఁ గూలఁద్రోసి
క్రూరఖరనఖాసులఁ గ్రుమ్మి క్రుమ్మి విడువు

(మెఱుపు మెఱయును.)

(స్వ) మెఱుపు మెఱసినంతలో నీముఖ మిదేమి మహా భయంకర మైనది. (ప్రకాశము) నీ వెవరవు?

వల : ఇ దేమి యీ ప్రశ్న? నేను సైరంధ్రిని.

కీచ : నిజము చెప్పుము!

వల : ఈ యనుమాన మెందులకు?

కీచ : నీమొగ మింత యెఱ్ఱగా నున్నదేమి?

వల : అలంకారముగాఁ జేతులకుఁ బూసికొనిన కుంకుమ వానచేతఁ దడిసి మొగమునకుఁ దుడుచుకొనఁగా నంటినదా యేమి!

కీచ : కావచ్చును.

వల : అట్లా మాట్లాడెదవది? నీకోస మీయర్ధరాత్రమున నీ వర్షములోఁ బడి వచ్చితినే!

కీచ : అవును! మిగులఁ గష్టపడి వచ్చితివి.

వల : ఎట్లు రాకయుందును? నారహస్యము నీకుఁ దెలిసిన తరువాత?

కీచ : ప్రియా! నీవు శృంగారరస పట్టభద్రవు?

వల : ఎట్లు?

కీచ : నన్ను నీలవసనములు ధరించి రమ్మనుటయే.

వల : కాని యీచీఁకట్లు రౌద్రరసముగా మార్చుచున్నవి దానిని.

కీచ : కాదివి మనల రక్షించుచున్నవి.

వల : అవును, నా రహస్యమును రక్షించుచున్నవి.

కీచ : రమణీశిరోమణీ! ఇంకఁ దాళలేను.

రావే! నీ కవుఁగింట నన్నదుముచే! రాజీవపత్రేక్షణా!
నీ విన్నాణముచేత నాహృదయముల్ నీరయ్యెనే యియ్యెడన్
భావంబుల్ సొగసెల్ల నీయెడలనే పండెన్ మనోజాతదీ
ప్తావైశ్వానరుఁ దృప్తిచేసి కుహూనాస్వర్గంబుఁ జూపాడెదన్.
నీపైఁ గోరికజేసి యుండనుకఁ దన్వీ! మన్మథోద్యచ్ఛర
క్షేపం బెంతఁగ నోర్చితిన్ దుదకు నీ స్మేరాస్యముల్ జూడఁగా
నోపన్ గాఢతరాంధకారమున నిస్వ్యూహంబు సంపూర్ణమై
నా పాపంబు ఫలించినట్లగుపడున్ వాలీకకేళీదృశా!

ప్రియా! ఏది నీచేయి నందిమ్ము! నీకరస్పర్శమునఁ గలిగిన చల్లఁదనముచేతఁ జలివేయుచున్నది. ఈ వర్షకాలరాత్రి యందు నేను మంచుగడ్డవలె బిగిసికొనిపోయెదను.

వల : నీవటు కాకపోయినచో నే నీ చేతులతో నలిపి ముద్దగాఁ జేసెదను.

కీచ : నీచేయి సందిమ్ము!

వల : నర్తనశాలలోనికిఁ బోదము!

కీచ : నీవు నడువుము.

వల : ముందు నీవు నడువుము! నేను వచ్చెదను.

కీచ : కికురించి పోవుగా?

వల : ఈ మహాగ్నిలో నేనును సమానముగానే వేగింపఁ బడుచున్నాను.

కీచ : ప్రియా ! నీ యీ మాటతో బ్రహ్మలోకము సజముఁ బులకితమైనది! (నిష్క్రమించును.)

వల : పాంచాలీ !

ద్రౌ : (ప్రవేశించి) చచ్చినాఁడా?

వల : ఇంకను గాలేదు.

ద్రౌ : ఇందాఁకనుండి యేమి చేసితిరి?

వల : చమత్కారము.

ద్రౌ : అవును, మీకుఁ జమత్కారమే.

వల : దేవి! కోపించకుము!

ద్రౌ : వాఁడభినవదుశ్శాసనుఁడు.

వల : కాని మిక్కిలి రసికుఁడు.

ద్రౌ : క్రొత్తఁగా స్త్రీ లెప్పు డయితిరి!

వల : మాతముఁడజ్ఞాతవాసమునకు మొదట. నేనుజివర.

ద్రౌ : అజ్ఞాతవాసము కా వచ్చినదా?

వల : ఆ. అందుకనియే నీ కీ శుభము. ఇక దుర్యోధన దుశ్శాసనుల రాబోవు మహావధకుఁ జాలిక.

ద్రౌ : యుగ్మములయందు మీ యీ మహోత్సాహమే మిమ్ము విజయులను జేయుచున్నది.

వల : విజయుఁడు మా తమ్ముఁడు.

ద్రౌ : అవును. అర్జునుఁడు జయించువాఁడు. మీరు సాక్షాత్తుగా జయమే యనతగిన మూర్తి.

వల : ఇదిగో! ఇప్పుడే వానిని వధించితిని.

(ద్రౌపది నిష్క్రమించును.)

కీచ : (ప్రవేశించి) ప్రియా! ఇంక రమ్ము. నా యీ గాఢంపు కౌఁగిట నొదుగుము.

వల : (వెనుకకుఁ బోవును)

కీచ : లజ్జావతి! ఇది నీ కెంతయు నొప్పియున్నది. (చేయిపట్టుకొనును)

కీచ : (స్వ) ఈమె చేయి యింత గట్టిగా నున్నదేమి? ఇది స్త్రీ కాదు. ఏ శిఖఁడో పురుషుఁడు.

వల : (స్వ) వీని చేయి యింత మృదువుగా నున్నదేమి? ఇంత బలహీనుఁడా!

కీచ : నీచేయి పురుషుని చేయివలె నున్నది.

వల : నేను పురుషుఁడనే!

కీచ : ఓరీ! మూర్ఖుఁడా! ఎవఁడవురా నీవు? ఇంతవఱకు గొంతు మార్చుకొంటివా?

నల : (స్వ) ఓహో! వీఁడు మిక్కిలి పౌరుషశాలివలె నున్నాఁడు. నేను పురుషుఁడనని తెలిసినంతనే వీఁడు పొంగిపోయినాఁడు. ఇంతలో వీనిశౌర్యము మహాశక్తిసన్నమైపోయినది.

కీచ : ఎవఁడవురా నీవు?

నల : నేను గంధర్వుఁడను.

కీచ : దొంగవేష మేల? నిజము చెప్పుము!

నల : నేనా! యుధిష్ఠిరసార్వభౌముని తమ్ముఁడను, భీమసేనుఁడను. (అని కీచకుని చేయి పట్టుకొనును)

కీచ : అది నాకుఁ దెలియును.

నల : అందుకనియే మఱియుఁ దొందరగా హరింపఁబడుచున్నావు.

కీచ : ఛీ! నాకొఱకు స్త్రీవై వచ్చి పౌరుష మేటికి?

నల : ఓరి దుష్టుఁడ (చంపును)

సమయజ్ఞుఁడు (ప్రవేశించి)

సూత్రధారుఁడును మహాకవియు నగు మాయన్నగారు మంగళనాశ మిట్లాయనని విచారాంబుధిలో మునిగియున్నారు. భరతవాక్యముమాట మఱచిపోయినారు.

ప్రథితపురాణసంచయమిసిరాంపథవర్తను లై జనుల్ చతు
ర్విధపురుషార్థ యోగముల నిశ్చితతత్త్వనూక్ష్మ భావనా
పథముల గుర్తెరింగి శ్రుతిబంధురధర్మవినిశ్చితాత్ములై
పృథులభవాంబురాశి భయమేది చరించి చరింత్రు గావుతన్.

(తెరపడును)

సమాప్తము.